జనవరి 2002  Rs. 10/-

# చందమామ

నూతన సంవత్సర శుభాకాంక్షలు

A 
ACTIVE

B 
BUZZ

BOSS

C 
CADET DX

D 
DEVIL DX

E 
ELEPHANT

F 
FISH

G 
GIRAFFE

H 
HEN

I 
INSECT

J 
JOKER

K 
KIDD DX

L 
LI'L ANGEL
LAMBADA
LIMBO

M 
MISSILE
MISS INDIA Jr

N 
NEST

O 
ORANGE

P 
PIRANHA

Q 
QUEEN Jr

R 
ROBO COP

S 
SPARKY

SALSA

T
TERMINATOR

V

W




The largest range of kids bikes
**HERO CYCLES**
THE ABC OF CYCLING


భారత సంస్కృతి-చరిత్ర 47


సుశాంతుడి మౌనం! (బే.క) 19


యక్షపర్వతం 11


మాయావీణ 51



## ఈ సంచికలో



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్: 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :98203-02880
ఫోన్: 022-266 1599/266 1946/
265 3057



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# హక్కులు-బాధ్యతలు!

మనం 2002లోకి అడుగుపెడుతున్నాం.యాభైసంవత్సరాల క్రితం జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో ప్రప్రథమంగా మనదేశంలో ప్రజలు ఎన్నుకున్న ప్రజాస్వామ్య ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. మన రాజ్యాంగం రూపొందిన రెండేళ్ళ తరవాత అది సాధ్యమయింది. 1950 జనవరి 26వ తేదీ మనదేశం సర్వసత్తాక ప్రజాస్వామ్య దేశంగా ప్రకటించబడింది. వయోజన ఓటుహక్కు ప్రాతిపదికగా 1951 అక్టోబర్ 1952 ఫిబ్రవరి నెలల మధ్య మొట్టమొదటి ఎన్నికలు జరిగాయి.

ప్రతి పౌరుడూ దేశ సార్వభౌమత్వాన్నీ, సమైక్యతనూ, సమగ్రతనూ పరిరక్షించాలని రాజ్యాంగం నిర్దేశిస్తున్నది. కన్నవారిపట్ల పిల్లలకున్న బాధ్యతలాగా, పౌరులందరికీ దేశంపట్ల ఉన్న గురుతరమైన బాధ్యత ఇది!

వాక్స్వాతంత్ర్యం, వృత్తి స్వాతంత్ర్యం, మతస్వాతంత్ర్యం మొదలైన హక్కులను మన రాజ్యాంగం కల్పించింది. అంతేకాదు; ఆ హక్కులకు సంబంధించిన బాధ్యతలనుకూడా ఆదేశించడం మన రాజ్యాంగంలోని విలక్షణ అంశం. హక్కులను కోరే ముందు, మనబాధ్యతలనుసక్రమంగానెరవేర్చాలని మహాత్మాగాంధీఉద్బోధించారు.

ప్రస్తుతం మనదేశం వివిధ రంగాలలో రకరకాల ఒడిదుడుకులకూ, ఒత్తిడులకూ లోనవుతున్నది. దేశ సౌభాగ్యంలోనే మన భవిష్యత్తు ఇమిడి ఉన్నది. అందువల్ల స్వార్థరహితంగా మాతృభూమికి సేవలందించాలనీ; దేశ సమైక్యతనూ, సమగ్రతనూ పరిరక్షించడానికి శాయశక్తులా కృషిచేయాలనీ ప్రతి ఒక్కరం ఈ నూతన సంవత్సరంలో నిర్ణయం తీసుకుందాం!

---

సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 4

ఆధునిక భారతదేశంలో-వివిధరంగాలలో ఘన విజయాలు సాధించిన మహాపురుషులు ఎందరో ఉన్నారు. అలాంటి 'ఆధునికహీరో'లకు సంబంధించిన ఈ క్విజ్ మీ కోసం!

అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*

1 సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్న మొట్టమొదటి ఆసియాఖండ నివాసి. ఆయన రచించిన గీతాలు జాతీయోద్యమకారులకు స్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ కలిగించాయి. ఆయన ఎవరో మీకు తెలుసా?

----------------------------------------

2 మనదేశం చేసిన పోఖ్రాన్ అణుపరిశోధనలను తలచుకోగానే మనకు గుర్తుకువచ్చే పేరు ఏది? రక్షణా సాంకేతికరంగ పరిశోధనలో ఈ భారతరత్న అవార్డు గ్రహీత సుప్రసిద్ధుడు. ఆయన ఎవరు?

----------------------------------------



3 ఈ నోబెల్ బహుమతీ గ్రహీత గౌరవార్థం మనం యేటా ఫిబ్రవరి 28 వ తేదీని 'నేషనల్ సైన్స్ డే' గా జరుపుకుంటున్నాము. ఆయన 1928 లో భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమతి అందుకున్నాడు. ఆయన పేరేమిటో ఊహించగలరా?

----------------------------------------

4 ఈ సుప్రసిద్ధ సితారు విద్వాంసుణ్ణి ఇంగ్లాండు రాణి గౌరవ 'నైట్‌హుడ్'తో సత్కరించింది. ఆయన ఎవరో మీకు తెలుసుకదా? చెప్పండి మరి!

----------------------------------------

5 లక్షలాది అభిమానుల అభిమానానికి పాత్రుడైన ఈయనకు కొల్‌కతాలో గుడి కూడా ఉంది. ఒక పాప్యులర్ టీవీ 'గేమ్ షో'కు ప్రస్తుతం ఆయన హోస్ట్‌గా ఉంటున్నాడు. ఆయన ఎవరు?

----------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపిన చోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన మీ మహాపురుషుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన ఆధునిక హీరో:

..........................................................................

..........................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................................

వయసు:..............తరగతి: ...............................................

చిరునామా:.....................................................................

..........................................................................

పిన్: ........................... ఫోన్: ...........................

పాల్గొనేవారి సంతకం: ........................

తల్లి/తండ్రి సంతకం:........................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 ఫిబ్రవరి 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-4**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





# వెంకన్న సన్యాసం!

జోగిపురంలో వెంకన్న అనే బీదవాడొకడు ఉండేవాడు. వాడికి భార్య ఇద్దరు పిల్లలు, ముసలితల్లి వుండడంతో, ఎంతకష్టపడినా గొర్రెతోక బెత్తెడే అన్నట్టు సంపాదన తిండికి కూడా సరిపోయేదికాదు. అవిధంగా వాడు, నానా కష్టాలకూ లోనవుతూ, ఇక లాభంలేదని సన్యాసం పుచ్చుకోదలచి, అడవిలోవున్న ఒక సన్యాసుల మఠంకేసి బయలుదేరాడు.

వెంకన్న విచారంగా తలవంచుకుని అడవి మార్గాన పోతూండగా, మార్గమధ్యలో ఒక డబ్బు సంచీ వాడి కంటబడింది. వాడు సంచీ తీసుకుని ఎక్కడలేని ఉత్సాహంతో, "నేను సన్యాసం పుచ్చుకోవడం, ఈ చుట్టుపక్కల వుండే వనదేవతకు ఇష్టం లేనట్టున్నది. అందుకే, ఆ మహాతల్లి కరుణించి మార్గ మధ్యంలో డబ్బు సంచీ పెట్టింది! ఇంటికి తిరిగిపోయి, ఈ డబ్బుతో సుఖంగా బతుకుతాను," అనుకుంటూ పట్టరాని సంతోషంతో వెనుదిరిగాడు.

ఆ మరుక్షణం, "ఒరే, ఆగు!" అంటూ పెద్దకేక వినబడింది.

వెంకన్న ఆగి బెదురుగా తలతిప్పి చూశాడు. కండలు తిరిగిన ఇద్దరు దొంగలు, చేతిలో తళతళమెరిసే చురకత్తులతో వాడికంట బడ్డారు. వాళ్ళు దాపులనున్న ఊళ్ళో దొంగతనంచేసి, ఆ డబ్బుతో తమ స్థావరానికి పోతూ, దొంగిలించిన డబ్బులో ఒక సంచీ చేజారి దారిలో పడిపోయిందని గ్రహించారు. వాళ్ళు డబ్బు సంచీ వెతుకుతూ వస్తూండగా, చేతిలో డబ్బు సంచీతో వెంకన్న కనిపించాడు.

దొంగలిద్దరూ, వెంకన్నను సమీపించి, "నోరు మెదపకుండా, ఆ డబ్బు సంచీ ఇటివ్వు. మేము ఎంతో సాహసించి నేర్పుగా సంపాయించిన డబ్బును, ఉట్టినే దొంగిలించుకు పోదామనుకున్నావా?" అంటూ గద్దించారు.

వెంకన్న వణికిపోతూ, డబ్బు సంచీని దొంగలకిచ్చి, "అయ్యలారా! ఇది మీ సొమ్మని నేనెరగను. ఎంతకష్టపడీ కుటుంబాన్ని

ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి

పోషించలేక సన్యాసం పుచ్చుకుందామని బయలుదేరాను. దారిలో కంటబడిన ఈ డబ్బుసంచీని, నా కష్టాలు తీర్చడానికి ఏ వనదేవతో కరుణించి ప్రసాదించిందని పొర బడ్డాను,'' అన్నాడు.

ఆ జవాబుకు దొంగలు పెద్దగా నవ్వి, ''నీ బీదతనం పోగొట్టేందుకు వనదేవత సాయపడుతుందని లేనిపోని ఆశలు పెట్టు కోకు. అదుగో, ఆ రాళ్ళగుట్ట మలుపు తిరిగా వంటే సన్యాసుల మఠం కనబడుతుంది. వాళ్ళీసరికే పొట్టచేతబట్టుకుని, ఊళ్ళవెంట భిక్షాటనకు బయలుదేరి వుంటారు. పోయి, వాళ్ళగుంపులోచేరు,'' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయారు.

దొంగలమాట వినగానే వెంకన్నకు, సన్యా సులంటే ఏవగింపు కలిగింది. తనకు వ్యవ సాయప్పనులు తెలుసు, కాయగూరలు పండించడం తెలుసు. అలాంటి తను, సంసారం మోయడం భారంగా వున్నదని ముసలి తల్లినీ, కట్టుకున్న భార్యనూ, కన్న పిల్లలనూ వదిలి సన్యాసుల వెంట జోలె కట్టు కుని తన ఒక్కడి తిండికోసం ఊళ్ళు తిరగ డమా? ఛీ!'' అనుకుంటూ గబగబా నడిచి ఇల్లు చేరాడు.

వెంకన్న తల్లి, కొడుకు ఏదో విచారంగా వుండడం గమనించి, ''ఏరా, వెంకూ! ఏం జరిగిందేమిటి, అలా వున్నావు?''అని అడిగింది.

వెంకన్న దాచకుండా జరిగిందంతా తల్లికి చెప్పాడు. ఆమె, వాణ్ణి ఓదారుస్తూ, ''ఆఖరు క్షణంలో ఏ దేవుడో నీకు మంచిబుద్ధి పుట్టిం చాడు. ఆ సన్యాసులు ఎలా బతుకుతున్నా రనుకున్నావు? మనబోటి గృహస్థులు జాలి కొద్దో, ధర్మబుద్ధితోనో వేసే పిడికెడు మెతుకు లతో. అయినా, పుచ్చుకునేవారికన్నా ఇచ్చే వారికే పదిమందిలో చాలా గౌరవం కదా!'' అన్నది.

''ఆసంగతి నాకు మాత్రం తెలియదా ఏం,'' అన్నాడు వెంకన్న కాస్త విసుగ్గా.

వెంకన్న తల్లి, ఒక క్షణం ఆగి, ''తెలిసుండే సన్యాసుల్లో కలవబోవడం, బుద్ధిగల పనేనా? కష్టమో సుఖమో మరి నాలుగైదేళ్ళు ఓపిక పట్టు. నీ కొడుకులిద్దరూ ఈడువాళ్ళవుతారు. వాళ్ళూ నీకు సాయంగా పనిపాటుల్లో కలి సొస్తారు. ఆ తరవాత సంసారం సుఖంగా సాగిపోతుంది,'' అన్నది.



# ప్రాణభయం!

అరణ్యంలో కుందేలొకటి, ఆహారంకోసం తిరుగుతూ, ఒకచోట కాళ్ళుజారి చిన్న నీటిగుంటలో పడిపోయింది. ఆ గుంటలోని నీరు అది మునిగిపోయేంత లోతుగా లేదు. కుందేలు నీటి గుంటనుంచి బయటపడేందుకు నానాప్రయత్నాలు చేసింది కానీ, అక్కడినుంచి పైకి రాలేక పోయింది.

''ఇక నా చావు, ఈ నీటిగుంటలోనే!'' అనుకుంటూ, కుందేలు విచారపడుతున్న సమయంలో, అటుగా వచ్చిన రెండు కుందేళ్ళూ, ఒక కోతీ దానిని బయటికి లాగేందుకు ప్రయత్నించినై. కానీ, అది వాళ్ళెంత సాయం చేసేందుకు శ్రమించినా గుంటనుంచి పైకి రాలేక, ''మీ ప్రయత్నం అంతా వృథా! ఇక మీ దారిన మీరు పొండి,'' అన్నది విసుక్కుంటూ.

కుందేళ్ళూ, కోతీ దాని దుస్థితికి విచారపడుతూ అక్కణ్ణించి వెళ్ళిపోయినై. ఆ తర్వాత కొద్దిసేపటికి నక్క ఒకటి అరుస్తూ, కుందేలున్న నీటిగుంట ప్రాంతానికి రాసాగింది. నక్క అరుపు వింటూనే కుందేలు ప్రాణభయంతో కంపించిపోతూ, ఒక్క ఎగురున నీటిగుంట నుంచి బయటికి దూకి పారిపోసాగింది.

కుందేలు అలా కొంతదూరం పోయాక, అంతకు ముందు దానికి సాయం చేయవచ్చిన కుందేళ్ళూ, ఎదురుపడి ఎక్కడిలేని ఆశ్చర్యంతో, ''మేమంత సాయపడినా గుంటనుంచి బయటికి రాలేనిదానివి, నీకై నీవు ఎలా బయటికి రాగలిగావు,'' అని అడిగినై.

అందుకు కుందేలు, ''నక్కబావ పాడుతూ నేను ఉన్నచోటికి రావడం గమనించాను. అంతే! ఆ ఉత్సాహంతో ఒక్క ఎగురున గుంటనుంచి బయటపడ్డాను,'' అన్నది.

ఆ మాట విని కుందేళ్ళూ, కోతీ నవ్వుకున్నాయి!



ORISSA
The soul of India

మీకు ఒక క్విజ్

# కటక్

మెయ్యేళ్ళ నగరంగుండా నడవడం అంటే ఎంతో ఉత్తేజభరితంగా ఉంటుంది కదూ! సహస్రాబ్ది వేడుకలు జరుపుకున్న ఒరిస్సాలోని కటక్ నగరంలో పర్యటిస్తే –మీలోని పర్యాటనాసక్తికీ, వినోద ప్రీతికీ, కొత్తకొత్త వస్తువులు కొనాలనే ఉత్సాహానికీ, ప్రకృతి ప్రేమకూ అన్నిటికీ సంతృప్తినిస్తుంది!

'కటక్'ను పూర్వకాలంలో 'కటకం' అని పిలిచే వారు. ఇది ఒరిస్సాలోని ప్రధాన నగరాలలో ఒకటి. వివిధ వంశీయులు పరిపాలించిన సుసంపన్నమైన చరిత్రకలిగినదీ నగరం. గాంగవంశీయులు నిర్మించిన ఇక్కడి బారాబతి కోట శిథిలాలు ఈనాటికీ చరిత్ర కారులను ఆకర్షించి ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి!

మీరు తీర్థయాత్రలకు వెళ్ళాలనుకుంటు న్నారా? అసంఖ్యాకమైన దేవాలయాలూ, ప్రార్థనా స్థలాలూ ఉన్న ఈ నగరాన్ని మీరు తప్పక సందర్శిం చాల్సిందే. కాదమ్-ఇ-రసూల్‌ను ముస్లింలూ, హిందువులూ పవిత్రమైన స్థలంగా భావిస్తారు. ప్రవక్త మహమ్మదు పాద ముద్రలు గల గుండ్రటి రాయి ఇక్కడ ఉందని చెబుతారు.

అన్సుపా సరస్సు ప్రకృతి సౌందర్యానికి నిలయం. శీతాకాలంలో ఇక్కడికి వలసవచ్చే వివిధజాతుల పక్షులు కనులపండువ చేస్తాయి. మీరు ఎత్తయిన ప్రాంతాలకు చేరుకోవాలని ఉవ్విళ్ళూరే పర్వతారో హకులా? మీకు సాహసోపేతమైన అనుభూతుల్ని కలిగిస్తుంది అశోకఝర్. సరదాగా, సంతోషంగా వినోద యాత్ర చేయడానికి అనువైనప్రదేశం మహానదిలోని దవళేశ్వర్ అనే అందమైన చిన్న ద్వీపం!

చిన్నచిన్న ఆభరణాలమీదా, వస్తువులమీదా వెండి, బంగారపు అల్లికచేసే అందమైన 'ఫిలిగ్రీ' పనితనానికీ; వెండివస్తువులకూ, కొమ్ములతో, దంతాలతోచేసే అందమైన వస్తువులకూ పట్టు, ప్రత్తి వస్త్రపరిశ్రమలకూ కటక్ ప్రసిద్ధిగాంచింది.

---

మీకు ఒక క్విజ్
**14– ఏళ్ళ లోపు పిల్లలకు**
**పోటీ–5**

1. పూరీలోని రఘురాజ్‌పూర్ ఒక విలక్షణమైన చిత్రలేఖనానికి ప్రసిద్ధిగాంచింది. అది ఏది?

.............................................

2. ఉక్కు కర్మాగారానికి ప్రసిద్ధిగాంచిన ఒరిస్సాలోని నగరం ఏది?

.............................................

3. 'ఉషాకోఠి' వన్యప్రాణుల శరణాలయం ఒరిస్సాలో ఎక్కడ ఉన్నది?

.............................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097**

పేరు : .............................................
వయసు : .............................................
చిరునామా : .............................................
.............................................
పిన్ ..................... ఫోన్ ..........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3 days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar-751 014. Ph: (0674)432177, Fax:(0674)430887, e-mail:ortour@sancharnet.in. Website:Orissa-tourism.com




## 13

[ఖడ్గజీవదత్తులూ, మణిభూషణుడూ విడిదిచేసిన చోటుకు రాత్రివేళ ఒక రాక్షసి వచ్చింది. దాని భర్తద్వారా జీవదత్తుడు యక్షపర్వతాన్ని గురించిన కొన్ని రహస్యాలు తెలుసుకున్నాడు. నడిరేయి వేళ మణిభూషణుడు ఏదో అలికిడి విని, నిద్ర మేల్కొని, రాక్షసులు వచ్చి మీదపడుతున్నారని భయంతో అరవసాగాడు. —తరవాత]

మణిభూషణుడి అరుపులు వింటూనే జీవదత్తుడు నిద్రలేచాడు. ఖడ్గవర్మ మణిభూషణుడికి ధైర్యం చెబుతూ, "మణిభూషణా, నీకొచ్చిన భయం ఏమీ లేదు. ఆ వచ్చిన ఇద్దరు రాక్షసులకూ నువ్వు యక్షమణిరంజితుడివి కాదనీ, అతడి సేవకుడివైన మణిభూషణుడివనీ చెప్పాను. వాళ్ళు నా మాట నమ్మి వెళ్ళిపోయారు," అన్నాడు.

ఆ తరవాత మణిభూషణుడికి ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు. తెల్లవార్లూ అతడు మేలుకునే వున్నాడు. సూర్యోదయం అవుతూనే ఖడ్గజీవదత్తులు లేచారు. అందరూ కాలకృత్యాలు ముగించి, తిరిగి పడవ దగ్గిరకు పోయారు. మణిభూషణుడు పడవను తీరానికి దగ్గిరగా నడపసాగాడు.

ఒక అరగంట కాలం గడిచిన తరవాత పడవ తీరంపక్కగా ఒకచోట ఆగింది. అక్కడ నది కొండపక్కన ఒక మలుపు తిరగటంతో చిన్న రేవు ఏర్పడింది. మణిభూషణుడు పడవను అందులోకి పోనిచ్చి, ఒడ్డుకు దిగుతూ, "ఇదే యక్షపర్వతం! ఇక మీరు దిగవచ్చు. అరెరె, నా యజమాని మణిరంజితుడు, మనలను కలుసుకునేందుకు ఇక్కడికి స్వయంగా వచ్చాడు," అన్నాడు.

ఖడ్గజీవదత్తులు పడవలోంచి ఒడ్డుకు దిగి, కొండకేసి తలెత్తి చూశారు. అక్కడ వున్న



ఎగుడుదిగుడు రాళ్ళల్లో ఒకదాని మీద యువకుడైన యక్షుడొకడు నిలబడి వున్నాడు. అతడి చేతిలో చిన్న గద వున్నది. ఆ యువకుడు కన్నార్పకుండా ఖడ్గజీవదత్తులకేసే చూస్తున్నాడు.

ముందు మణిభూషణుడు దారితీయగా ఖడ్గజీవదత్తులు ఆ యక్షుణ్ణి సమీపించారు. అతడు ఖడ్గజీవదత్తులకేసి తీవ్రదృష్టితో చూస్తూ, "ఖడ్గజీవదత్తుల్లారా! మీ దుస్సాహసం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేస్తున్నది. బుద్ధిః కర్మానుసారిణీ, అన్నారు పెద్దలు. పాపం, మిమ్మల్ని అని ఏం లాభం," అన్నాడు.

జీవదత్తుడు, మణిరంజితుణ్ణి ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, చిరునవ్వు నవ్వుతూ, "మణిరంజితా! రాజకుమారి పద్మావతికి, ఇక్కడున్న రాతిరథాన్ని కదిలించినవాడు మహావీరుడన్న అభిప్రాయం కలిగించి, ఆ పనిమీద ఇక్కడికొచ్చేవారిని హతం చేయాలని నువ్వు మంచి పథకమే వేశావు. అదే నీ కంఠానికిప్పుడు ఉరితాడు కాబోతున్నది. ఏరీ, నువ్వు చెరబట్టి తెచ్చిన పద్మావతీ, వసంతకుమారీ రాజకన్యలు? ఆ రాతిరథం ఎక్కడ?" అన్నాడు.

ఆ మాటలకు మణిరంజితుడు ఉగ్రుడైపోయి చేతనున్న గద ఎత్తబోయేంతలో, ఖడ్గవర్మ కత్తి పిడిమీద చేయివేసి, "మణిరంజితా, ఆ రాతిరథాన్ని మేం కదిలించలేనప్పుడు నువ్వు మా ఇద్దర్నీ చంపే ప్రయత్నం చేయవచ్చు. అప్పుడు వసంతకుమారి మాట ఏమోగాని, పద్మావతి మాత్రం నిన్ను మహావీరుడుగా భావించి తప్పక వివాహం ఆడుతుంది. కనక, ముందు ఆ రాతిరథం ఎక్కడున్నదో చూపించు," అన్నాడు.

మణిరంజితుడు కోపంగా ఏదో అనబోయేంతలో మణిభూషణుడు అతడితో, "తొందరపడకు, మణిరంజితా! ఈ యువకులను ముందు ఆ రాతిరథం దగ్గిరకు తీసుకుపో," అన్నాడు.

మణిరంజితుడు కాస్త స్థిమితపడి బయలుదేరాడు. కొద్దిసేపటికల్లా వాళ్ళు కొండ మీద సమతలంగా వున్న ఒక ప్రదేశాన్ని చేరారు. దానికి దిగువ ప్రదేశమంతా ఫలవృక్షాలతో, పూలతోటలతో ఎంతో రమణీయంగా వున్నది. ఆ తోటల మధ్య ఒకదానికొకటి కొంచెం ఎడంగా రథాకృతిలోవున్న రెండు భవనాలు వున్నవి. అందులో ఒకదాని మీద ఇద్దరు యువతులు నిలబడి ఖడ్గజీవదత్తులకేసి చూస్తున్నారు.

జీవదత్తుడు, ఆ యువతులకేసి ఓమారు చూసి, "మణిరంజితా, వారేనా నువ్వు తెచ్చిన

రాజకుమార్తెలు పద్మావతీ, వసంత కుమారీ?''
అని ప్రశ్నించాడు.

''అవును, మీ శౌర్యపరాక్రమాలు కళ్ళారా చూసేందుకు వాళ్ళక్కడ నిలబడి వున్నారు,'' అంటూ మణిరంజితుడు తల పక్కకు తిప్పి, ''ఇదుగో, ఈ కనబడేదే రాతిరథం!'' అన్నాడు పళ్ళు కొరుకుతూ.

అక్కడకు దాపులనే దాదాపు ఇరవై అడుగుల ఎత్తున్న ఒక రాతిరథం వున్నది. ఆ రథం వున్నచోటు నుంచి దిగువకు కొండ ఏటవాలుగా పరుచుకుపోయింది. ఖడ్గజీవదత్తులు ఆ రథంకేసి బయలుదేరగానే మణిరంజితుడు, ''మణిభూషణా!'' అంటూ పక్కకు తిరిగి చూశాడు. కాని మణిభూషణుడు ఆ చుట్టుపక్కల ఎక్కడా లేడు.



తన మిత్రుడు ఇలా చెప్పాచెయ్యకుండా వెళ్ళిపోయినందుకు ఆశ్చర్యపడుతూ మణిరంజితుడు రాతిరథం దగ్గిరకు వెళ్ళాడు. ఆసరికి ఖడ్గజీవదత్తులు రథంచుట్టూ ఓమారు తిరిగి చూశారు. జీవదత్తుడు వంగి రథం అడుగు భాగాన్ని ఖడ్గవర్మకు చూపుతూ, ''ఖడ్గా, ఈ రథం కొండలో మలిచినదికాదు, వేరుగా ఇక్కడ పడివున్న రాతిని రథంగా చెక్కారు. దిగువనుంచి సన్నని వెలుగూ, మనుషులు మాట్టాడుకుంటున్నట్టుగా, అస్పష్టమైన ధ్వనులూ వినిపిస్తున్నవి,'' అన్నాడు.

జీవదత్తుడు ఇలా అనగానే మణిరంజితుడు కత్తిదెబ్బ తిన్నవాడిలా ఎగిరి గంతేసి, ''రథం అడుగునుంచి వెలుగూ, మాటలూ నీకు వినబడుతున్నవా? అసంభవం! అసంభవం!'' అన్నాడు. ''అసంభవం ఎలా అవుతుంది? కొండలోపల వున్న మణిమాణిక్యాలనూ, బంగారాన్నీ తవ్వి బయటికి తీసే నీ బానిసలందరూ మూగవాళ్ళు కాదు గదా? ఏమంటావు?'' అన్నాడు జీవదత్తుడు కోపంగా.

మణిరంజితుడు ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడై, '' ఈ సంగతి నీకెవరు చెప్పారు? ఆ దుష్టుడు మణిభూషణుడా?'' అన్నాడు రౌద్రంగా.

''పాపం, ఆ మణిభూషణుణ్ణి నిందించకు. అతను నీకు సేవకుడో, మిత్రుడో కూడా మాకు అర్థంకాని పద్ధతిలో నిన్ను గురించి మాట్లాడాడు. నేను నా దివ్యదృష్టితో ఈ యక్షపర్వతానికి సంబంధించిన రహస్యాలన్నీ తెలుసుకున్నాను,'' అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

మణిరంజితుడు కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా, ''జీవదత్తా, ఈ ప్రగల్భాల

కేంగానీ, రాతిరథాన్ని కదిలించగలవేమో ప్రయత్నించి చూడు. నీ శక్తిసామర్థ్యాలను కళ్ళారా చూసేందుకు పద్మావతీ, వసంతకుమారీ ఆ భవనం మీద నిలబడివున్నారు,'' అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కనుసైగ చేసి, దాపుల కొండ దిగువున రథాకృతిలోవున్న భవనాలకేసి చేయి చూపుతూ, ''రాజకుమార్తెలు నిలిచివున్న భవనం పక్కనున్న ఆ అందమైన భవనం నీ నివాసగృహమే కదా, మణిరంజితా?'' అని అడిగాడు.

''అవును. ఈ ప్రశ్న అడగవలసిన అవసరం నీకెందుక్కలిగింది?'' అన్నాడు మణిరంజితుడు.

''ఆ భవనం ఇప్పుడు తునాతునకలై నేలమట్టంకాబోతున్నది. ఇదుగో, చూడు!'' అంటూ జీవదత్తుడు మంత్రం జపించి, దండాన్ని రాతిరథానికి గట్టిగా ఆనించి, కాలితో ఒక్క తన్ను తన్నాడు.

ఆ వెంటనే భూమి బద్దలవుతున్నంత భయంకరమైన శబ్దంతో రాతిరథం కదిలి, ఏటవాలుగా వున్న కొండ దిగువకు బాణ వేగంతో పోయి, మణిరంజితుడి భవనాన్ని ఢీకొట్టింది. భవనం, దానితోపాటు రాతిరథం ఫెళఫెళారావాలతో ముక్కలు చెక్కలయినై. విరిగిన కొన్ని భవనభాగాలూ, రాతిరథం ముక్కలూ వేగంగా అంత ఎత్తున పైకెగిరి, దాపులనున్న ఉద్యానవనంలో చెల్లాచెదురుగా పడినై.

కనుమూసి తెరిచేంతలో జరిగిపోయిన ఈ భయంకర సంఘటన చూసి మణిరంజితుడు నిలువెల్లా కంపించిపోయాడు. అయినా, అతడు ఒక్క క్షణకాలంలో తెప్పరిల్లి చేతనున్న గదను జీవదత్తుణ్ణి కొట్టేందుకు పైకెత్తాడు. కానీ, అంతలో ఖడ్గవర్మ కత్తిదూసి అతణ్ణి ఎదుర్కొన్నాడు.



జీవదత్తుడు సంతోషం పట్టలేక ఒక్కసారి పెద్దగా నవ్వి, తనకు గంధర్వ వసుమతి ఇచ్చిన కంచుఢక్కను చేతికి తీసుకుని గట్టిగా మోగించాడు. ఆ మరుక్షణం, రాతి రథం కదిలిపోగా దిగువ ఏర్పడిన బిలంలో నుంచి కొందరు రాక్షసులూ, గంధర్వులూ బిలబిలమంటూ కొండపైకి వచ్చి, గోలగోలగా అరవసాగారు.

జీవదత్తుడు వాళ్ళనందరినీ నిశ్శబ్దంగా వుండమని చెప్పి, "మీరందరూ ఈ క్షణం నుంచి స్వేచ్ఛా జీవులు, ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపొండి," అని కంచుఢక్కను పైకెత్తి పట్టుకుని, "ఈ కంచు ఢక్కను మా దేశ ప్రాంతాల ప్రవాసంలో వున్న వసుమతి అనే గంధర్వుడు నాకిచ్చాడు. మీలో గంధర్వులెవరైనా వుంటే దీన్ని నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు," అన్నాడు.

గంధర్వుల్లో ఒకడు ముందుకొచ్చి, జీవదత్తుడిచ్చిన కంచుఢక్కను తీసుకుని కళ్ళకు అద్దుకున్నాడు. జీవదత్తుడు విముక్తులైన రాక్షసులకూ, గంధర్వులకూ ఏదో చెప్పబోయేంతలో, "అబ్బా!" అన్న మణిరంజితుడి చావుకేక వినిపించింది. జీవదత్తుడు తలతిప్పి చూశాడు. ఖడ్గవర్మ, మణిరంజితుణ్ణి గాయపరిచి, అతడు నేలమీద పడిపోగా, అతడి గుండెలమీద కాలుపెట్టి, కత్తిని అతడి కంఠానికి గురిచేసి నిలబడి వున్నాడు.

ఆ దృశ్యం చూసి జీవదత్తుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. ఖడ్గవర్మ, జీవదత్తుడితో, "జీవా, ఈ దుర్మార్గుడైన మణిరంజితుణ్ణి చంపటమా, వదలటమా? వీడు రాజకుమార్తెలను అపహరించి తెచ్చి,



వాళ్ళకేకాక, వాళ్ళ తల్లిదండ్రులక్కూడా మానసిక క్షోభ కలిగించాడు," అన్నాడు.

ఆ సమయంలో అక్కడికి రాజకుమార్తె పద్మావతీ, వసంతకుమారీ వచ్చారు. వసంతకుమారి కళ్ళెర్రచేసి కిందపడివున్న మణిరంజితుడికేసి చూస్తూ, "ఈ నీచుడైన యక్షుణ్ణి చంపిన వీరుణ్ణే వివాహం ఆడతానని నేను ప్రతిజ్ఞ చేశాను. వీడి మరణం నేను కళ్ళారా చూడకపోతే, ఇక నేను జీవితకాలమంతా బ్రహ్మచారిణిగా వుండవలసిందే!" అన్నది.

ఖడ్గవర్మ, వసంతకుమారి కేసి చూసి, ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు. ఆమెను భార్యగా పొందాలంటే మణిరంజితుణ్ణి తాను చంపితీరాలి! ఈ ఆలోచన రాగానే అతడు కత్తిని మణిరంజితుడి



కంఠంలో గుచ్చేందుకు పైకెత్తాడు. అంతలో ఆకాశం నుంచి, ''ఆగండి!'' అన్న భీకర స్వరం వినిపించింది. అందరూ తలలు పైకెత్తి చూశారు.

హంసాకృతిలో వున్న విమానం ఒకటి వాళ్ళ ముందుకు వచ్చి, నేలదిగింది. అందులో నుంచి యక్షరాజూ, మణిభూషణుడూ బయటికి వచ్చారు. యక్షరాజు అక్కడవున్న అందరికేసి ఓమారు చూసి, ''ఖడ్గజీవదత్తుల్లారా! మీరు మహావీరులు, సందేహం లేదు. జరిగిన సంగతులన్నీ మణిభూషణుడిద్వారా విన్నాను. యక్షవంశంలో చెడబుట్టిన ఈ మణిరంజితుణ్ణి ప్రాణాలతో వదలండి. వాడు ఈనాటినుంచీ బతికి వుండి కూడా, జీవచ్ఛవం!'' అన్నాడు.

ఖడ్గవర్మ ఏమిచేయటమా అని సందేహిస్తున్నంతలో జీవదత్తుడు, ''ఖడ్గా, యక్షరాజు చెప్పింది విన్నావు కదా? మణిరంజితుణ్ణి క్షమించి వదిలెయ్యి,'' అన్నాడు.

''వీరపుర రాజకుమార్తె వసంతకుమారి ప్రతిజ్ఞ మాటేమిటి?'' అన్నాడు ఖడ్గవర్మ ఆమెకేసి నిశితంగా చూస్తూ.

వసంతకుమారి ఎక్కడలేని సిగ్గుతో తల వంచుకుని, పద్మావతి చాటుకు పోవాలని చూసింది.

యక్షరాజు చిరునవ్వు నవ్వి, ''మణిరంజితుడు బతికుండి చచ్చినవాడికిందే లెక్క అని ఇంతకు ముందే చెప్పారుగదా? అందువల్ల వసంతకుమారికి ప్రతిజ్ఞాభంగ దోషం అంటదు. ఇప్పుడు నేనే స్వయంగా రాతిరథం కదిలించిన మహావీరుడైన జీవదత్తుడితో పద్మావతికీ, ఖడ్గవర్మతో వసంతకుమారికీ వివాహం చేయబోతున్నాను! పుష్పమాలలెక్కడ?'' అన్నాడు.

మణిభూషణుడు విమానంలో నుంచి నాలుగు పుష్పమాలలు తెచ్చి ఖడ్గజీవదత్తులకూ, పద్మావతీ వసంతలకూ తలా ఒకటి ఇచ్చాడు. పద్మావతీ, జీవదత్తులు ఒకరిమెడలో ఒకరు పూలమాలలు వేశారు. ఖడ్గవర్మా, వసంతకుమారీ కూడా అలాగే చేశారు. చుట్టూ వున్నవాళ్ళ హర్షధ్వానాలతో ఆ ప్రదేశం మార్మోగిపోయింది.

ఆనాటివరకూ, యక్షమణిరంజితుడి కింద బానిసలుగా బతికిన గంధర్వులూ, రాక్షసులమధ్య నుంచి ఒక గంధర్వుడూ, ఒక రాక్షసుడూ ముందుకు వచ్చి, ఖడ్గజీవదత్తులకు పాదాభివందనంచేసి మౌనంగా నిలబడ్డాడు. వాళ్ళు తమకోరిక ఏదో చెప్పదలచారని గ్రహించిన జీవదత్తుడు, స్వేచ్ఛకాక

మరేదైనా కోరుకునేందుకు వచ్చారా? నిర్భయంగా చెప్పండి,'' అన్నాడు.

ఆ వెంటనే గంధర్వుడు, ''మహావీరా! నేను, యక్షమణిరంజితుడికి బానిసలుగా బతికినవాళ్ళ నాయకుణ్ణి. నా కోర్కె ఏమంటే- కొండలోపలి విశాలమైన బంగారు, మణిమరకతాలుగల గనుల్లోవున్న, ఆ అమూల్య సంపదను మాకు బహూకరించాలని,'' అన్నాడు.

ఇది విన్న జీవదత్తుడు ఖడ్గవర్మకేసి చూశాడు. ఖడ్గవర్మ చిరునవ్వు నవ్వి, ''గంధర్వనాయకుడి కోరికే, పక్కనున్న రాక్షసుల నాయకుడి కోరికా అయితే, మరికొంత సేపట్లో ఇక్కడ గంధర్వ, రాక్షసుల మధ్య భీకర సమరం తప్పదు,'' అన్నాడు.

ఖడ్గవర్మ మాట ముగించే లోపలే రాక్షసుల నాయకుడు, ఎంతో వినయంగా, ''ప్రభో! మేమందరం ఎంతోకాలంగా మణిరంజితుడి బానిసలుగా కష్టసుఖాల్లో అన్యోన్యంగా బతికినవాళ్ళం. నా కోరిక ఆ మణిమాణిక్యాలు కాదు.ఈనాటినుంచి,ఈ యక్షపర్వత ప్రాంతమంతా మాకూ, మా సంతానానికీ ధారాదత్తం చేయకోరతాను,'' అన్నాడు.

ఈ కోరిక ఖడ్గజీవదత్తులకు ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు యక్షరాజుతో, ''ఇదంతా మీ రాజ్యభాగంగదా! దీనిని ఇతరులకు ధారాదత్తంచేడానికి నేనెవర్ని?'' అన్నాడు.

యక్షరాజు ఒక క్షణకాలం మౌనంగా, తర్వాత గంధర్వ, రాక్షసులతో, ''నాదైన ఈ రాజ్యప్రాంతాన్ని దానదమన సర్వహక్కులతో మీ పరం చేస్తున్నాను,'' అని ఖడ్గజీవదత్తుల్ని, వాళ్ళ భార్యలతో పాటు విమానంలో ఎక్కమని చెప్పి, వాళ్ళు విమానంలో ఎక్కి కూర్చోగానే, ''ఖడ్గ జీవదత్తుల్లారా! మీ ఇచ్ఛామాత్రంతో ఈ విమానం మీరుకోరిన ప్రదేశానికి వాయువేగంతో ప్రయాణిస్తుంది. ఈనాటినుంచి నెల రోజులపాటు దీన్ని మీరు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. ఆ తరవాత నా విమానం నా దగ్గిరకు తిరిగి వస్తుంది! శుభం, వెళ్ళిరండి!'' అన్నాడు.

''మీ దయకు కృతజ్ఞులం, యక్షరాజా!'' అని ఖడ్గజీవదత్తులూ, పద్మావతీ వసంతలూ యక్షరాజుకు నమస్కరించారు. విమానం రివ్వుమంటూ పైకిలేచి పద్మవీర పురాలకేసి బయలుదేరింది. —(అయిపోయింది.)



# మంచీ మర్యాదా!

ఒకానొక అగ్రహారంలో, పురుషోత్తమశర్మ అనే పండితుడుండేవాడు. ఆయన శాస్త్ర, పురాణాలను క్షుణ్ణంగా చదివి అర్థంచేసుకున్న వ్యక్తిగా అందరూ చెప్పుకునేవారు. ఒకనాడు, దూర గ్రామంలో వుంటున్న రఘుపతి అనే పండితుడొకాయన పురుషోత్తమశర్మను చూడవచ్చాడు.

మధ్యాహ్న భోజనానంతరం ఇద్దరూ వీధి అరుగుమీద కూర్చుని తీరిగ్గా ఏవేవో శాస్త్ర చర్చలు చేయసాగారు. ఆ సమయంలో వీధిన వెళుతున్న కట్టెలు కొట్టేవాడొకడు, పురుషోత్తమశర్మను చూస్తూనే తలమీద వున్న కట్టెలమోపును కిందికి దించి, రెండు చేతులూ ఎత్తి, "దణ్ణాలు శర్మగారూ!" అన్నాడు వినయంగా.

ఆ వెంటనే పురుషోత్తమశర్మ చేతులెత్తి వాడికి నమస్కరిస్తూ, "బావున్నావా, ఎల్లయ్యా!" అంటూ పరామర్శించాడు.

ఇది చూసిన రఘుపతి, పురుషోత్తమ శర్మను, "ఇదేమిటి, శర్మగారూ! ఆ కట్టెలు కొట్టుకు బతికేవాడికి, మీరు నమస్కరించడం?" అని అడిగాడు.

దానికి పురుషోత్తమశర్మ చిరునవ్వు నవ్వి, "ఎల్లయ్య మంచీ మర్యాదా ఎరిగినవాడు. చేసే వృత్తులు ఏవైనా మనుషులందరూ ఒక్కటేకదా? మన శాస్త్రపురాణాలు బోధించేవీ అవే. మనల్ని గౌరవించినవాళ్ళను, మనం గౌరవించడంలోనే మన మంచీ మర్యాదా ఉన్నాయి," అన్నాడు.



బేతాళ కథలు

# సుశాంతుడి మౌనం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా! అచంచలమైన నీ పట్టుదల, దీక్ష ప్రశంసించతగినవే. కానీ, ఎందుకీపట్టుదల అని అడిగినప్పుడు నువ్వవహించే మౌనం మాత్రం నాకు నిగూఢంగానే ఉన్నది. స్పష్టమైన అవగాహన లేని సుశాంతుడిలా అసంబద్ధంగా, పరస్పర విరుద్ధంగా ఆలోచించినప్పుడు కూడా ఒక్కొక్కసారి మౌనం పాటించవలసి వస్తుంది. నువ్వు అలాంటి పొరబాటు చేయకుండా ఉండడానికి తగు హెచ్చరికగా నీకారాజు కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:



పుష్పగిరిరాజు సుశాంతుడు పరమ వివేకి; ఉదాత్తస్వభావం కలవాడు. అయితే, పున్నమి చంద్రుడిలో మచ్చలాగా ఆయనకు ఉన్న ఒకే లోపం కోపం. తన ఇష్టానికి విరుద్ధంగా ఏదైనా జరిగితే ఆగ్రహానికి గురయ్యేవాడు. ఒకసారి రాజాస్థానానికివచ్చినఅతిథులకు చేసినవంటలో ఉప్పు కొంచెం ఎక్కువయిందని వంట వాళ్ళను పనిలోనుంచి తొలగించడమేగాక, రాజ్యంనుంచే వెడలగొట్టాడు. అధికారులు కర్తవ్య నిర్వహణలో చిన్న పొరబాటుచేసినా కఠినశిక్షలు అనుభవించ వలసి వచ్చేది. ఒక్కొక్కసారి ఉద్యోగాలతోపాటు ప్రాణాలుకూడా పోగొట్టుకునేవారు. రాజులో ఉన్న ఈ కోపం కారణంగా, రాజ్యంలోఅన్నిసంపదలు ఉన్నప్పటికీ ఏ క్షణంలో ఏ ఆపద ముంచు కొస్తుందోనని ప్రజలు భయాందోళనలతో కాలం గడిపేవాళ్ళు.

ఒకనాడు రాజు కొలువుతీరి ఉండగా ఒక సాధువువచ్చి, రాజును దర్శించి, "రాజా, నా పేరు ప్రేమానందుడు. పది సంవత్సరాలు హిమాలయాలలో ధ్యానంలో గడిపాను. అది నాకు ప్రశాంతచిత్తాన్ని ప్రసాదించింది. అయితే, వ్యక్తిగత మోక్షమే జీవితపరమార్థం కాదనీ; ప్రజలకు మంచిమార్గం చూపవలసిన బాధ్యత నా మీద ఉందనీ గురువు నాకు కర్తవ్యబోధ చేశాడు. ఆయన ఆదేశానుసారం నేను హిమా లయాలు దిగివచ్చాను. తమ రాజ్యంలోని దేవాలయాలలో ధర్మబోధ చేయడానికి తమరు అనుమతించాలి," అన్నాడు.

రాజు ఆ మాటలకు పరమానందం చెంది, "మహాభాగ్యం, స్వామీ! మీరు ఇక్కడే కొన్నా ళ్ళుండి మాకూ, మా ప్రజలకూ మంచిమార్గం చూపండి," అన్నాడు.

"సర్వసంగ పరిత్యాగి అయినవాడు ఒకే చోట ఉండకూడదు. అయినా, నువ్వు కన బరుస్తూన్న ప్రేమాదరాలు నన్ను ఇక్కడి నుంచి కదలనివ్వడం లేదు," అన్నాడు సాధువు.

సాధువుకు రాజోద్యానంలో కుటీరం నిర్మించ బడింది. ఆయన అవసరాలు చూసుకునే బాధ్యతను ఉద్యానవన కాపలాభటుడూ, తోట మాలీ అయిన సుమంగళుడికి అప్పగించ బడింది. సుమంగళుడు తన భార్యా, ఇద్దరు పిల్లలతో ఉద్యానవనంలో ఉన్న గుడిసెలో నివసిస్తున్నాడు.

సాధువు రోజూ వేకువజామునే లేచి, జప తపాలు పూర్తిచేసుకుని, రాజసభకు వెళ్ళి రాజు దగ్గర రెండు గంటలసేపు గడిపేవాడు. ఆయన హితవచనాలను రాజు అమితాసక్తితో ఆలకించేవాడు. సాయంకాలం సాధువు నగరం

లోని దేవాలయాలవద్ద చేరే ప్రజలనుద్దేశించి ప్రసంగించేవాడు. అడిగినవారికి తగిన సలహాలు ఇచ్చేవాడు. రాత్రికి కుటీరానికి తిరిగి వచ్చి, సుమంగళుడూ వాడి భార్యాపిల్లలతో కలిసి భోజనం చేసేవాడు. పడుకునే ముందు పిల్లలకు చక్కని కథలు చెప్పేవాడు.

ఒకనాటి సాయంకాలం రాజూ, సాధువూ ఉద్యానవనంలో ఏదో మాట్లాడుకుంటున్నారు. సుమంగళుడు పూలమొక్కలకు నీళ్ళు పడుతున్నాడు. అప్పుడు సాధువు ముఖం దగ్గర తుమ్మెదలు తిరుగుతూ ఆయనకు ఇబ్బంది కలిగించడం సుమంగళుడు గమనించాడు. వెంటనేవాడు పరిగెత్తిపోయి, ఒక్కొక్కొంతు గెంతి తుమ్మెదలను అవతలికి తరిమాడు.




తమ సంభాషణకుఅంతరాయంగా తోట మాలి రావడంతో రాజుకు పట్టరాని కోపం వచ్చింది. "ఎవరు నిన్నిలా రమ్మన్నది? సాధువుకు ఇబ్బంది కలిగిస్తే తుమ్మెదలను తరమడానికి నేను లేనా? మామధ్య నువ్వెందుకిలా వచ్చావు? వెళ్ళిపో.. ఇకపై నీ ముఖం నాకు చూపకు!" అని గద్దించాడు.

సుమంగళుడికి భయంతో నోట మాట రాలేదు. అయితే అంతలో సాధువు రాజుతో, "నాయనా, అతన్ని దూషించకు. అతడి ఉద్దేశం దోషరహితంకదా? అయినా, కోపం తెచ్చుకోవడం సులభం; అయితే, కోపావేశంతో తీసుకున్న నిర్ణయాలు సరైనవి కావన్న నిజం నిలకడమీద తెలుస్తాయి. కోపంవచ్చినప్పుడు మౌనంగా ఉండి, మనసు కుదుటపడి మామూలు స్థితికి వచ్చాక ఆ విషయంపై నిర్ణయం తీసుకోవడమే సముచితం. కోపావేశంతో సుమంగళుణ్ణి వెళ్ళగొట్టావంటే, అతడిస్థానంలో అలాంటి సమర్థుడూ, నిజాయితీపరుడూ అయినవ్యక్తి లభించడం సులభం కాదు కదా!" అన్నాడు మందహాసం చేస్తూ.

రాజు సాధువు సలహాను పాటించి, సుమంగళుణ్ణి క్షమించాడు.

సాధువు నీతిబోధలు రాజును ఎంతగానో ప్రభావితం చేశాయి. కొన్ని నెలలు గడిచాక సాధువు రాజుతో, "సాధ్యమైనంతఎక్కువమందికి ఉపయోగపడాలన్నదే నా జీవితలక్ష్యం. పొరుగు రాజ్యాలకు వెళ్ళి మరింత మందికి మంచి మార్గం చూపాలని ఉన్నది," అన్నాడు.

"తమరిని వదిలి ఉండడం అసాధ్యం, మహాత్మా!" అన్నాడు రాజు.

"నా మాట విను నాయనా. నేను ఎన్ని రాజ్యాలు తిరిగినా, ఎక్కడ ఉన్నా, మూడు నెలలకు ఒకసారి నీ వద్దకు వచ్చి, నీ క్షేమం, నీ ప్రజల బాగోగులను తెలుసుకుని వెళుతూ




ఉంటాను. సరేనా?'' అన్నాడు సాధువు. రాజు అందుకు అంగీకరించడంతో, ప్రేమానందుడు ఆరోజే అక్కడి నుంచి బయలుదేరి వెళ్ళి, పొరుగురాజ్యమైన పవనగిరిలో మూడు నెలలు గడిపాడు. ఆ తరవాత ఒకనాడు పుష్పగిరికి తిరిగివచ్చాడు. రాజధానీనగరం చేరి రాజోద్యానం సమీపించే సరికి చీకటి అలముకుంటున్నది. ఆయన రాకను సుమంగళుడు గమనించ లేదు. దాహం వేయడంతో ఉద్యానవనం మధ్య ఉన్న తటాకం దగ్గరికి వెళ్ళి కమండలాన్ని నీళ్ళలోకి ముంచాడు. అలా ముంచినప్పుడు నీళ్ళనుంచి గుడగుడమనే శబ్దం వచ్చింది. ఉద్యానవనంలోని గుడిసె చాటుగా చేతిలో ఈటెతో పొంచివున్న సుమంగళుడు ఆ శబ్దం విన్నాడు. ఈమధ్య వన్యమృగాలు రాత్రివేళ ఉద్యానంలో జొరబడిపాడు చేయడం వల్ల వాటికోసం వాడు మాటువేసి ఉన్నాడు. ఏదో వన్యమృగం తటాకం దగ్గరికి వచ్చిందని భావించి, ఈటెను తటాకం కేసి విసిరాడు. అదివెళ్ళి సాధువు వీపులో దిగబడింది. సాధువు అబ్బా అంటూ బాధతో మూలిగాడు. సుమంగళుడు అక్కడికి పరిగెత్తిపోయి చూశాడు. సాధువు ఊపిరాడక విలవిలలాడుతున్నాడు. సుమంగళుడు ఆయన పాదాలపైబడి కన్నీరు మున్నీరుగా విలపించాడు.

''ముందు వీపులో గుచ్చుకుని ఉన్న ఈటెను వెలికి తీయి. ప్రశాంతంగా ప్రాణం వదులుతాను,'' అన్నాడు సాధువు.

సుమంగళుడు ఈటెను లాగి, సాధువును నేలపై పడుకోబెట్టి, ''క్షమించండి స్వామీ! తెలియక చేసిన నేరం ఇది,'' అన్నాడు ఏడుస్తూ.

''నాకు తెలుసు నాయనా! నిన్ను క్షమించాను,'' అంటూ సాధువు చిరునవ్వుతో ప్రాణం విడిచాడు. సుమంగళుడు భయంతో వణికి

పోయాడు. ఈ సంగతి రాజుకు తెలిస్తే, తన గతీ, తనపిల్లల గతీ ఏమవుతుంది? అని ఆలోచిస్తూ గుడిసెలోకి వెళ్ళి, జరిగినదాన్ని భార్యకుచెప్పి, రాత్రికిరాత్రే భార్యాపిల్లలతో సహా నగరం వదిలి వెళ్ళిపోయాడు.

మరునాడు రాజభటులు ఉద్యానవనంలో సాధువు శవాన్ని చూసి సుమంగళుడి కోసం వెతికారు.వాడి జాడ తెలియలేదు. ఏకారణం వల్లనో సుమంగళుడే సాధువును హత్యచేసి ఎటో పారిపోయాడన్న నిర్ణయానికి వచ్చారు. ఆ సంగతి రాజుకు తెలియజేశారు. రాజు ఆగ్రహావేశానికి అంతులేకుండా పోయింది. రాజ్యమంతటా సుమంగళుడి కోసం వెతక మన్నాడు. అయినా వాడు దొరకలేదు.

సుమంగళుడు పొరుగు రాజ్యానికి వెళ్ళి పోయాడు. ఒకసంవత్సరకాలం గడిచింది. కాని వాడక్కడ సంతోషంగా ఉండలేకపోయాడు. వాడికి పుష్పగిరికి తిరిగి రావాలనిపించింది. ఒకనాడు రహస్యంగా పుష్పగిరికి వచ్చి రాజా స్థానంలో ఉద్యోగంలో ఉన్న తన బాల్యమిత్రుణ్ణి కలుసుకుని జరిగినది చెప్పి సాధువు మరణా నికిసంబంధించి రాజు తనపై ఇంకా ఆగ్రహంగా ఉన్నాడా లేదా అని తెలుసుకోమన్నాడు.

వాడి మిత్రుడు రాజు మనోభావాన్ని తెలు సుకోవడానికి సరైన అవకాశం కోసం ఎదురు చూడసాగాడు. ఒకనాడు వేరొకరాజోద్యోగి రాజు దగ్గరికి వచ్చి, కొత్తగా పనిలోకిచేరిన తోటమాలి మాటిమాటికీ ఏవేవో పరికరాలు అడుగుతున్నా డని చెప్పడం విన్నాడు. ఇదే మంచి సమయం అనుకుని, అతడు రాజుతో, ''సుమంగళుడు చాలా సమర్థుడైన తోటమాలి. పరికరాల కోసం అంత ఖర్చుపెట్టేవాడు కాడు,'' అన్నాడు.



అయితే రాజు ఆ మాటకు బదులు పలక లేదు. అతడు ఆ సంగతి సుమంగళుడికి చెప్పి, మరికొన్నాళ్ళు దూరంగానే ఉండమని సలహా ఇచ్చాడు. మరొక ఆరు నెలలు గడిచింది. సుమంగళుడు మళ్ళీ తన మిత్రుణ్ణి కలుసు కుని రాజుతో తనసంగతి విన్నవించమన్నాడు. మిత్రుడు ప్రయత్నించాడుకానీ, ఇప్పుడు కూడా రాజు మౌనంగానే ఉండిపోయాడు.

మరొక ఆరు నెలలు గడిచాయి. సుమం గళుడు ఆగలేక, ప్రాణాలకు తెగించి, తన కుటుంబంతోసహా పుష్పగిరికి తిరిగి వచ్చాడు. తిన్నగా రాజాస్థానానికెళ్ళి రాజు పాదాలపై బడి, సాధువు అకాలమరణం గురించి జరిగినదంతా వివరించి, తనను క్షమించమని వేడుకున్నాడు.

''సుమంగళా, ఉద్దేశపూర్వకంగా నువ్వా పనిచేయలేదని నాకు తెలుసు. వచ్చి కొలువులో చేరు!'' అన్నాడు రాజు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! సుమంగళుడి బాల్యమిత్రుడు వాడి సమర్థతనూ, మంచితనాన్నీ గురించి చెప్పిన రెండుసార్లూ రాజు సుశాంతుడు బదులేమీ పలకకుండా మౌనం వహించాడు. అయితే, రెండేళ్ళ తరవాత సుమంగళుడే స్వయంగా వచ్చి, పాదాలపై బడి జరిగినదంతా వివరించాక, వాణ్ణి క్షమించి కొలువులోకి తీసుకున్నాడు. ఇక్కడ రాజు ప్రవర్తనలో అసంబద్ధత, వైరుధ్యం కనిపించ డంలేదా? సుమంగళుడు చెప్పిన తరవాతే రాజు అసలు విషయంగ్రహించాడా లేక అంతకు ముందే గ్రహించాడా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు సుశాంతుడి ప్రవర్తనలో ఏమాత్రం అసంబద్ధతా, వైరుధ్యం లేదు. సాధువు మరణం ప్రమాదవశాత్తు జరిగిందేతప్ప, సుమంగళుడు ఉద్దేశపూర్వకంగా ఆయన్ను చంపలేదని రాజు ఎప్పుడో గ్రహించాడు. ఆయనకు సుమంగళుడి స్వభావం తెలుసు. అయితే, తాను ఎంతో గౌరవించే సాధువు ప్రేమానందుడు హఠాత్తుగా ఘోరమరణం చెందడంతో రాజు ఆగ్రహించిన మాట వాస్తవమే. రాజుకు ఉన్న ఒకే ఒక బలహీనత కోపం అన్నసంగతి అందరికీ తెలుసు. కోపంగా ఉన్నప్పుడు ఏ నిర్ణయమూ తీసుకోవద్దనీ, మామూలుస్థితికి వచ్చిన తర్వాతే ఒక నిర్ణయానికి రమ్మనీ ప్రేమానందుడు రాజుకు సలహా ఇచ్చాడు. సుమంగళుడి మిత్రుడు తొలిసారిగా వాడి మంచితనాన్ని ప్రస్తావించినప్పుడు కూడా రాజు కొంత ఆగ్రహంగానేఉన్నాడు. అయినా, సాధువు సలహాను పాటించి మౌనం వహించాడు. రెండవసారి ప్రస్తావించినప్పుడు మరింత తీవ్రంగా ఆలోచించ సాగాడు. దుర్ఘటన జరిగి రెండేళ్ళు కావడంతో కాలమే ఆయన బాధను తగ్గించింది. అందు వల్లనే, సుంగళుడు స్వయంగా వచ్చి, క్షమాపణలు చెప్పుకోవడంతో వాణ్ణి క్షమించాడు. మొదటి రెండుసార్లూ మౌనం వహించడానికి కారణం–సాధువు సలహాను పాటిస్తూ ఆయన చూపిన మనోనిగ్రహం! అంతేగాని, ఆయన ఆలోచనా విధానంలో ఎలాంటి అసంబద్ధతా, వైరుధ్యాలూ లేవు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)





# విఘ్నేశ్వరుడు

సత్యలోకంలో కమలాసనం మీద కూర్చుని, పగలంతా సృష్టి చేసి, చేసి అలసిన బ్రహ్మకు, కల్పాంతం సమీపించటంతో నిద్రమత్తు ఆవరించింది. ఆ నిద్రమత్తులో ఆయన ఆవులించినప్పుడల్లా పర్వతశిఖరాగ్రాలు చిట్లి, అగ్నులను వెదజల్లాయి. నిద్రపట్టే సమయాన కళ్ళు చెమ్మగిల్లగా, ఆకాశంలో గుంపులు, గుంపులుగా కూడిన ప్రళయ మేఘాలు మెరుపులతో, భయంకరంగా గర్జిస్తూ, ఏనుగు తొండాలవంటి ధారలతో వర్షించి, లోకాన్ని జలమయం చేశాయి. ఆయన కనురెప్పలు బరువుగా వాలడం ప్రారంభించేసరికి అన్ని దిక్కులా గాఢాంధకారం అలుముకున్నది.

ఈప్రళయ పరిస్థితిలో బ్రహ్మ నిద్రించాడు. ఆయనకు ప్రళయమనేది రాత్రి కాలం. తిరిగి నూతన కల్పారంభంకానున్న సమయం ఆసన్నమైంది. సరికొత్త జగత్తు మీద వెలుగు ప్రసరించబోతున్న తరుణంలో సరస్వతీదేవి వీణ సవరించి భూపాల రాగ స్వరాలను మెల్లగా పలికిస్తూండగా బ్రహ్మకు మెలకువ వచ్చింది.

ఆయన పద్మాసనం వేసి కూర్చుని, నాలుగు ముఖాలతో, నాలుగు దిక్కులూ కలయచూశాడు. కిందవున్న జగత్తు అంతా నీటిమయమై మహాపర్వతాల్లాంటి కెరటాలతో కల్లోలంగా ఉంది. ఆ తరంగాల మధ్య ఒకచోట కళ్ళను మిరుమిట్లుకొల్పే తెల్లని కాంతిరేఖ కనిపించింది. ఆ కాంతిలో తరంగాలపై తేలుతూ ఒక పెద్ద మర్రి ఆకు, దానిపై చందమామలాంటి పసివాడు పడుకుని కుడి కాలి బొటనవేలు చప్పరిస్తూ కనిపించాడు.

బ్రహ్మ చేతులు జోడించి, కన్నులుమూసి ధ్యానించి తెరచినంతలో ఒక వింత దృశ్యం కనిపించింది. ఆ పసివాడు విశ్వవిరాట్ స్వరూపుడైన పరబ్రహ్మమేనని–బ్రహ్మకు అనుభవపూర్వకంగా తెలిసినవిషయమే. కాని ఇప్పుడా పిల్లవాని తల ఏనుగు తలను

**1. వటపత్ర బాలగణపతి**



పోలి, చిన్నారి తొండంతో కుడిపాదాన్ని పట్టి నోటిలో పెట్టుతూన్నట్టుగా కనిపించింది.

ఆ ముఖం చాలా ప్రసన్నంగా ఉంది. పిల్లవాడు చంద్రకాంతితో ప్రకాశిస్తున్నాడు. నాలుగు చేతులు కలిగి ఉన్నాడు. బ్రహ్మ ఆశ్చర్యంగా చూస్తూన్న మరునిముషంలో, ఆకుతోసహా ఆ పిల్లవాడు అదృశ్యమయ్యాడు. బ్రహ్మకు ఆ ప్రదేశాన ఎత్తుగా లేచిన పెద్ద మట్టిదిబ్బ ఒకటి కనిపించింది. క్రమక్రమంగా నీటినుంచి సువిశాలమైన భూభాగాలూ, సముద్రభాగాలూ ఏర్పడ్డాయి.

బ్రహ్మ సృష్టికి పూనుకున్నాడు. మొదట పర్వతాలూ, నదులూ ఏర్పడాలని సంకల్పించి కమండలం లోంచి నీరు తీసి జగత్తు మీద చల్లాడు. తరవాత వృక్షాలనూ, సస్యాలనూ, ఖనిజాలనూ సంకల్పించాడు. పిమ్మట కద లాడే జీవరాశిని–మొదట సముద్రంలో చేపలనూ, భూమ్మీద జంతుజాలాన్నీ, క్రిమికీట కాదుల్నీ, పక్షుల్నీ సృజించాడు. తరవాత మను ష్యులను సంకల్పించి కమండలోదకాన్ని చిలికాడు.

బ్రహ్మ సృష్టి చేస్తున్నంతసేపూ సరస్వతీ దేవి వీణ వాయిస్తూనే ఉన్నది. ఎందువల్లనో అనుకోనివిధంగా వీణ అపశృతి పలికింది. సరస్వతి నివ్వెరపోతూ కిందకు చూసి మరింత నివ్వెరపడింది. బ్రహ్మ, అర్ధాంగి నివ్వెరపాటు అర్థంకాక కమలాసనం నుంచి వంగి కిందికి చూశాడు.

పర్వతాలు బోర్లపడుతూ శిఖరాలు భూమి లోకి పాతుకుని వెడల్పుగా పర్వత పాదాలు సూర్యరశ్మి పడకుండా గొడుగుల్లాగా ఎదుగు తూన్నవి. సముద్రతరంగాల మీద జలచరాలు తేలుతూ కుప్పిగంతులు వేస్తున్నవి. కొన్ని నిటారుగా పయనిస్తున్నవి. కొన్ని పక్షుల్లా ఎగురుతున్నవి.

జంతువులూ చాలా అనర్థాలతో పుట్టాయి; తలలు లేకుండా కొన్ని, వెనుక కాళ్ళు లేకుండా కొన్ని, ఒంటికాలివీ, మూడు కాళ్ళవీ, కళ్ళూ, చెవులూ అన్నీ వుండి నోరు అనేది లేనివీ, తోకలకు తలలున్నవీ, తలకు తోకలున్నవీ కనిపించాయి. పక్షులకు రెక్కలు లేవు. అవి నడవాలంటే కాళ్ళులేక నేల మీద దొర్లుకుంటున్నవి. ఈ వక్రతలన్నీ గమనించి బ్రహ్మ ఎంతగానో కలవరపడుతూ తన ఉత్తమోత్తమ మనుష్య సృష్టి ఎలాగుందో నని ఆత్రంగా చూశాడు.

మనుషులలో కొందరికి రెండు తలలు ఉన్నాయి. అందులో ఒకటి స్త్రీది, రెండోది పురుషుడిది.

పురుషులు జానెడు, బెత్తెడుగా ఉన్నారు. స్త్రీలు పెద్ద ఏనుగుల్లాగా, తాటిచెట్లలాగా ఉన్నారు. వీపులకు తలలు అతికించినట్లున్న వాళ్ళూ, నాలుగు, మూడు, ఒంటికాళ్ళ వాళ్ళూ, పొట్టకే పెద్దనోళ్ళున్న కబంధులూ ఆక్రందనలు చేస్తూ కనిపించారు.

జంతువులు మోరలు పైకెత్తి దీనంగా అరుస్తున్నవి. మూగగా చూస్తున్నవి. బ్రహ్మను నిందిస్తూన్నట్లుగా గింజుకుంటున్నవి, కదను తొక్కుతున్నవి.

ఒక జానెడు మగవాడు తాటిచెట్టంత వికృతాకారిణి అయిన స్త్రీని చూపిస్తూ, ''ఓ బ్రహ్మదేవా! ఇలాంటి స్త్రీతో నేనెలా సంసార సాగరం ఈదేది?'' అంటూ ఆకాశానికి తలపెట్టి పెద్దగా అరుస్తున్నాడు.

''నాలుగు తలలంటూ ఉన్నా, అసలు తల అంటూలేని ఓయి బ్రహ్మదేవుడా! మమ్మల్నెందుకిలాగ పుట్టించావు?'' అంటూ వికృతాకారాల మనుషులు చేస్తూన్న ఆక్రందనలు మిన్నుముట్టుతున్నవి.

బ్రహ్మ నాలుగు తలలూ గిర్రున తిరిగి పోయాయి. ఎనిమిది కళ్ళూ బైర్లుకమ్మాయి. తెల్లబోతూ బ్రహ్మ సరస్వతి వంక అయోమయంగా చూశాడు. అతని నాలుగు తెల్ల మొహాలనూ చూసి సరస్వతి సరసంగా చిరునవ్వుతో సరిపెట్టి ఊరుకున్నది.

''ఎందుకిలా జరిగింది? సక్రమమైన సృష్టి జరపాలనే సత్సంకల్పంతోనేకదా నేను సృష్టికి పూనుకున్నాను; ఇలాగ ఎందుకు 'జరిగింది?'' అని తనలోతాను అనుకుంటున్నట్లుగా గట్టిగా తలలు పైకెత్తి అరిచాడు బ్రహ్మ. అతని ప్రశ్న దశదిశలా మారుమ్రోగింది.



అయోమయంగా వెర్రిచూపులు చూస్తున్న బ్రహ్మకు పెద్ద వెలుగు కనిపించింది. ఆ వెలుగులో ఒక అద్భుతమూర్తి కనిపించాడు. ఆ మూర్తికి ఏనుగు తల ఉన్నది. నాలుగు చేతులలో పాశము, అంకుశము, కలశము, పరశువు ధరించి ఉన్నాడు. పూర్ణచంద్రుడివలె ప్రకాశిస్తున్నాడు. తెల్లని అతని ఉత్తరీయము ఆకాశమంతటా రెపరెపలాడుతూ ఎగురుతున్నది. అప్పుడు సరస్వతి వీణ ఓంకారనాదం చేసింది. సరస్వతీదేవి వేళ్ళు వాటంతటవే వీణపై నాద నామక్రియారాగాన్ని పలికిస్తూ, మాయా మాళవ గౌళరాగానికి మారుతూ, హంసధ్వనిరాగాన్ని అందుకున్నవి. గజాననుడై సాక్షాత్కరించిన ఆ దివ్యమూర్తి వటపత్రంపై నిలుచుని బ్రహ్మను అభయముద్రతో ఆశీర్వదించాడు. అతని చుట్టూరా శరత్కాల పూర్ణిమ నాటి వెన్నెలవంటి వెలుగు ఆవరించి ఉన్నది.



బ్రహ్మ అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరిస్తూ, ''మహానుభావా! అద్భుత మూర్తివైన నీ వెవ్వడవు? నీవెవరో తెలుసు కోలేని అజ్ఞానిని, అనుగ్రహించు!'' అని అడిగాడు.

''నాయనా! బ్రహ్మదేవా! సంకల్పం వెను కనే వికల్పం వెంటాడుతూంటుంది; అదే విఘ్నం! విఘ్నాన్ని అరికట్టి సంకల్పాన్ని నెర వేర్చే నేను విఘ్నేశ్వరుడను! విఘ్నాలకు నాయకత్వం వహించే వికల్పాన్ని నా గొడ్డ లితో ఛేదించి ప్రతి కార్యాన్నీ నిండు కలశం లాగ జయప్రదం చేసే విఘ్న వినాయకు డిని. పంచభూతములనబడే పృథ్వి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములనే భూత గణానికి అధిపతినైన గణపతిని. ఆహార ధాన్యాల్ని ఫలించే సస్యాల్ని నాశనం చేసే మదించిన ఏనుగులవంటి విఘ్నాలను నా వాడిగల అంకుశంతో అదుపులో పెడుతూ వాటిని నా పాశము అనే బలమైన తాటితో కట్టి ఉంచే నన్ను, విఘ్నేశ్వరుడు అని పిలువు!'' అని గంభీర స్వరంతో విఘ్నేశ్వ రుడు పలికాడు.

అప్పుడు బ్రహ్మ ''దేవా! విఘ్నేశ్వరా! నా సృజన శక్తికి ఎందుకలాగ ఘోరమైన విఘ్నం జరిగింది? ఇన్ని వంకరలెందుకు ఏర్పడ్డాయి? ఉత్తమంగా సృష్టి జరిగే మార్గం వివరంగా చెప్పు!'' అన్నాడు.

''విఘ్నం గురించి నీకు తెలియాలనే ఇదంతా జరిగింది. మర్రి ఆకుపై బాలగణ పతిగా కనిపించిన వటపత్ర గణపతినే నేను. అప్పుడు నా గురించి ఆలోచించలేకపోయావు. నాగురించి ఆలోచించడమంటే విఘ్నం గురించి ముందు జాగ్రత్తపడే జ్ఞానాన్ని కలిగి ఉండ టమే! ఆ జ్ఞాన స్వరూపుణ్ణే నేను! బ్రహ్మ మొదలుకొని బుద్ధిగల ప్రతిజీవీ కార్యరంగా నికి దిగేముందు విఘ్నం రాకుండా జయ ప్రదంకావడానికి తగు జాగ్రత్తనూ, జ్ఞానాన్నీ కలిగిఉండక తప్పదు! ఏనుగు అడుగు వేసేముందు నేల గట్టితనాన్ని తెలుసుకుని మరీ నడుస్తుంది; ప్రాణుల్లో ఏనుగు బుద్ధి బలం దానిలాగే చాలా పెద్దది. ఏనుగంత విశేష మేధస్సును కలిగి ఉండాలనే సూచ నగా నేను గజాననుడిగా ఉన్నాను. నీవు నిద్రి స్తూన్న సమయంలో రాక్షసుడైన నరకా సురుడు నీ నాలుగు వేదాల్నీ అపహరించి సముద్రం అడుగున దాచాడు; మహావిష్ణువు మత్స్యావతారం దాల్చి వాణ్ణి సంహరించి నీ వేదాల్ని భద్రంగా తెచ్చి వటపత్రశాయినై ఉన్న నా దగ్గర ఉంచాడు. ఇవిగో! వాటిని

తిరుగ గ్రహించి సృష్టి నిర్వర్తించు!'' అని చెప్పి, విఘ్నేశ్వరుడు బ్రహ్మకు వేదాలను ఇచ్చాడు.

బ్రహ్మ వాటిని అందుకుని పరమానందంతో విఘ్నేశ్వరుణ్ణి స్తుతించుతూ, ''విఘ్నేశ్వరా! నేను సృష్టి సంకల్పించే ముందు నిన్ను ధ్యానించి,మనసారా నిన్ను పూజించిమరీ కార్యరంగానికి ఉపక్రమించేవరం అనుగ్రహించు! అవకతవకలుగా తయారైన సృష్టి ఉపసంహరించుకునేలాగ చెయ్యి!'' అని కోరాడు.

విఘ్నేశ్వరుడి ప్రభావం వల్ల అంతవరకు జరిగిన వంకరటింకరల సృష్టి అంతా క్షణంలో మటుమాయమైంది. అప్పుడు విఘ్నేశ్వరుడు మళ్ళీ బ్రహ్మతో, ''బ్రహ్మదేవుడా! వక్రతను తుండతుండములుగా ముక్కలు చేసేవాడిని గనుక, నేను వక్రతుండుడు అనే పేరుకు సార్థకంగా నా తొండాన్ని వక్రంగా ఉంచుతూంటాను. వక్రతుండుణ్ణి అయిన నన్ను ధ్యానించి తలపెట్టిన నీ పని కూడా వంకరపోదు! నీవు కోరుకున్నట్లే నన్ను ధ్యానించి సృజించు. సృజించటం ఒక కళ! ఆ కళ ఎటువంటి వంకరటింకరలు పోకుండా జగత్తు నీవు మలచిన కళానిలయంగా భాసిస్తుంది! నీకుమల్లే జగత్తులో అందరికీ అందుబాటుగా తొలి పూజలందుకునే విఘ్నేశ్వరుడిగా విఘ్నాల నుంచి కాపాడుతూ, సంకల్పసిద్ధిని కలిగించే సిద్ధివినాయకుడుగా, సకల గణాలకూ అధిపతిగా గణపతినై శివపార్వతులకు కొడుకుగా అవతరిస్తాను!'' అని చెప్పి, బ్రహ్మను దీవించి అంతర్ధానమయ్యాడు.

సరస్వతీదేవి బ్రహ్మకేసి చిరునవ్వు నవ్వి హిందోళ, శ్రీరాగాలతో మంగళస్వరాల్ని మహాకాశం పులకరించేట్లుగా వీణపై వినిపించింది.

బ్రహ్మ ''విఘ్నేశ్వరాయనమః!'' అంటూ సృష్టిని ప్రారంభించాడు. సృష్టి మరింత అందంగా నిర్విఘ్నంగా సాగింది. గంభీరమైన పర్వత పంక్తులూ, అమృతజలాలతో నదులూ, సుందర వనాలూ, రంగు రంగుల బొమ్మల్లాంటి జంతుజాలమూ, శారీరకంగానూ, మానసికంగానూ ఉన్నతులూ, బలవంతులూ అయిన మనుషులతో జగత్తు బ్రహ్మ చేసిన కళానిలయంగా విలసిల్లింది. వాగ్దేవి అయిన సరస్వతి తన వాణిని సంగీతంలా ప్రాణికోటికి స్వరపరిచింది. జీవకోటి సలక్షణంగా పెరిగింది. ఊడలు చిమ్మే వట వృక్షంలాగ జగత్తు వర్ధిల్లింది.



# చందమామ కబుర్లు

## 'నక్షత్ర-వనాలు'

హిందూ పంచాంగంలో అశ్వని నుంచి రేవతి వరకు ఇరవై యేడు నక్షత్రాలున్నాయి. ఒక్కొక్క నక్షత్రానికీ సంబంధించిన ఒక్కొక్క పుష్పం, జంతువు, పక్షి, చెట్టు ఉన్నాయి. ప్రతి హిందువూ ఏదో ఒకనక్షత్రంలో జన్మించి ఉంటాడు. దీనినే మనిషి జన్మ నక్షత్రం అంటారు. ఈ నక్షత్రాల పేర్లతో విద్యార్థులచేత మొక్కలు నాటించడానికి వేద భారత సమాజం(ది వేదిక్ ఇండియా సొసైటీ) ఒక చక్కటి పథకం ఆలోచించింది. తమిళనాడు కోయంబత్తూరులోని ఈ 'వేద భారత సమాజం', మేట్టుపాళయంలోని ఒక పాఠశాలను ఎంపికచేసుకున్నది. ఆ పాఠశాలలోని విద్యార్థులందరూ తమతమ జన్మనక్షత్రాలకు సంబంధించిన చెట్ల మొక్కలను నాటడానికి ప్రోత్సహించింది. తాము బడిచదువులు పూర్తిచేసేంతవరకు నాటిన మొక్కలకు నీళ్ళుపోసి సంరక్షిస్తామని విద్యార్థులందరిచేతా ప్రమాణం చేయించింది. ఈ 'నక్షత్ర-వనాల' పథకాన్ని దేశంలోని ఇతర పాఠశాలలకు కూడా విస్తరింపజేయడానికి 'వేద భారత సమాజం' పూనుకున్నది!




## పిల్లికూన దేహ 'శుద్ధి'!

మూడు నెలలే నిండిన పిల్లికూన సిల్వెస్టర్. అది ఒకనాడు చడీచప్పుడూ లేకుండా వెళ్ళి వాషింగ్ మెషీన్‌లో పడుకున్నవిషయం-కోపెన్‌హాగన్ ఫ్లాట్‌లో ఉన్న దాని యజమానురాలు గమనించలేదు. అది బాధతో అరవడం ఆరంభించాకే విషయం తెలియవచ్చింది. పైగా, అప్పటికే లోపలికి వేడినీళ్ళు సరఫరా అయ్యాయి. 'టైమర్' సెట్ చేయడంవల్ల వెంటనే మెషీన్‌ను ఆపలేకపోయింది. ఆఖరికి ఎలాగో పిల్లిని బయటకు లాగిచూస్తే అది స్పృహ తప్పిపోయి, ప్రాణవాయువు అందకపోవడంతో ఒళ్ళంతా నీలం రంగుగా మారిపోయి కనిపించింది. వెంటనే జంతు వైద్యశాలకు తీసుకువెళ్ళి చికిత్స చేయడంతో ప్రాణాలతో బయటపడి, కొన్నాళ్ళకు కోలుకుంది. అయితే, అది ఇంటికి తిరిగి వచ్చాక ఏంచేసిందో తెలుసా? వాషింగ్‌మెషీన్ తెరిచి ఉండడంతో, ఒక్క గెంతుగెంతి అందులోకివెళ్ళికూర్చున్నది!



## చెట్లకు పిడుగుల నుంచి రక్షణ!

సింగపూర్ ప్రభుత్వం చెట్లను చాలా జాగ్రత్తగా పరిరక్షిస్తోంది. ప్రతి సంవత్సరం కనీసం పది చెట్లయినా పిడుగుపాటుకు గురవుతున్నట్టు కనుగొనబడింది. అలాంటి వాటిలో రెండు మూడు చెట్లు ఆ క్షణమే దగ్ధమైపోతున్నాయి. మిగిలినవి క్రమంగా క్షీణించి, నశించిపోతున్నాయి. వాటిని తొలగిస్తున్నారు. చెట్లకు పిడుగుపాటు నుంచి రక్షణ కల్పించడానికి, ఒక్కొక్క చెట్టుమీద 'లైట్‌నింగ్ కండక్టర్ల'ను అమర్చడానికి ప్రభుత్వ అధికారులు నిర్ణయించారు. ఈ 'రాగి కండక్టర్లు' పిడుగులను లోపలికి గ్రహించి అలాగే భూమిలోకి తీసుకు వెళతాయి. ఆ విధంగా చెట్లు రక్షించబడతాయి. ఒక్కొక్క కండక్టర్‌కు దాదాపు 3,000 అమెరికన్ డాలర్లు ఖర్చవుతుంది. 30 మీ. ఎత్తుగా ఉన్న దాదాపు 100 చెట్లను ఇలాంటి రక్షణ కోసం గుర్తించారు. మిగిలిన దేశాలుకూడా అనుసరించదగ్గ మంచిపద్ధతి కదా ఇది!




## శామ్సన్-దెలీలా




బైబిల్ ''పాత నిబంధన'' లో ప్రస్తావించబడిన పేర్లు కావివి. ఆప్యాయతకు మారుపేర్లుగా లాస్‌ఏంజెలెస్, వ్యాన్స యాస్‌లో కనిపించిన రెండు శునకాల పేర్లు. బార్బారా ఫీరో అనే ఆవిడ వీటికి పేర్లు పెట్టింది. జర్మన్ షెఫర్డ్ జాతికి చెందిన ఒక కుక్క 'లాప్‌డాగ్'ను నడిపించడం ఆ స్త్రీ గమనించింది. చిన్నకుక్కకు కళ్ళు లేవు. అది ఫుట్‌పాత్ గుండా నడవడానికీ, సిగ్నల్స్ వద్ద ఆగడానికీ, రోడ్లు దాటడానికీ పెద్ద కుక్క సాయపడుతోంది. వాటిని కొన్ని రోజుల పాటు బార్బారా ఫీరో గమనించింది. వాటిమధ్యా ఉన్న స్నేహసంబంధానికి ఆమె ఆశ్చర్యపడింది. పెద్ద కుక్కను చూస్తే చిన్న కుక్క ఎంతో విధేయతతో నడుచుకునేది. పెద్దకుక్క అప్యాయతతో చిన్నకుక్క కాలిమీద తడితే అది ఠక్కున ఆగిపోయేది. వాటి ఆప్యాయతనూ, అన్యోన్యతనూ చూసి, కరుణగల ఆ ఇల్లాలు వాటిని చేర దీసింది. వాటికి ప్రేమతో పాత బైబిలులోని ప్రేమజంట పేర్లు పెట్టింది!

# హాస్యచతురులు: బీర్బల్



అక్బర్ చక్రవర్తి ఒకనాడు సభలో ఆసీనుడై ఉన్నాడు. అప్పుడు ఒక సభికుడు ఆయన్ను సమీపించి మూడుసార్లు వంగి సలాంచేసి, ''ఇస్ఫహాన్ నుంచి ఒక కొత్తరకం అత్తరు వచ్చింది. ప్రభువులు కరుణించి దానిని గురించి అభిప్రాయం చెబితే బావుంటుంది,'' అంటూ తన చేతిలోని ఒక అత్తరు సీసాను అక్బర్ చేతిలో పెట్టాడు

అక్బర్ సీసా మూత తీసి వాసన చూశాడు. సంతోషంతో మందహాసం చేస్తూ సభికుల కేసి చూస్తూ, ''నేను అత్తరు సీసాను మీర్‌షంసుద్దీన్ నుంచి పుచ్చుకోవడం మీరందరూ చూశారు. అప్పుడు ఇచ్చిన అతని చేయిపైన, పుచ్చు కున్న నా చేయి, కింద ఉన్నాయి. అయితే, పుచ్చుకునేవాడి చేయి పైన, ఇచ్చేవాడిచేయి కిందెప్పుడు ఉంటుందో చెప్పగలరా?'' అని అడిగాడు.



షంసుద్దీన్ ఒక్కక్షణం భయపడి పోయాడు. అత్తరు సీసాను ప్రభు వుల అరచేతిలో పెట్టి తానేమైనా తప్పుచేశానా? అని ఆలోచిస్తూ అక్బర్ అరచేతికేసి చూశాడు. అతనేదో చెప్పబోతున్నంతలో అక్బర్ అతనికేసి చేయి ఊపుతూ, ''నువ్వు చెబుతావా సమాధానం?'' అని అడిగాడు.

తెలియదు అన్నట్టు తల ఊపి, షంసుద్దీన్ తన ఆసనంలో వచ్చి కూర్చున్నాడు. సభికులను తికమక పెట్టే ప్రశ్నలడగడం అక్బర్ చక్రవర్తికి అలవాటే. ఈ రోజు అడిగిన ప్రశ్నకు ఎవరికీ సమాధానం తెలియక సభా సదులు తమలో తాము గుసగుస లాడుకోసాగారు.



మరొక సభికుడు లేచి నిలబడి, "ఒకచేయి పైనా, మరొకచేయి కిందా ఉండడం అంత ముఖ్యమైన విష యమా ప్రభూ," అన్నాడు. అక్బర్ మళ్ళీ ఒకసారి మందహాసం చేశాడు.

అక్బర్ ఎవరినో వెతుకుతున్నట్టు ఒక సారి సభాసదులను కలయజూశాడు. "అంటే, మీలో ఏ ఒక్కరికీ సమాధానం తెలియలేదన్నమాట? అవునూ, బీర్బల్ ఏడీ?" అని అడిగాడు అక్బర్. అందరి కళ్ళూ బీర్బల్ కోసం వెతకసాగాయి.

"ఇక్కడ ఉన్నాను ప్రభూ!" అంటూ బీర్బల్ వంగి నమస్కరిస్తూ సభలోకి అడుగుపెట్టాడు. "సరైన సమయానికి వచ్చావు, నా సందేహం తొలగించ డానికి," అంటూ అక్బర్ తన ప్రశ్నను మళ్ళీ అడిగాడు.

బీర్బల్ సభికులను ఒకసారి కలయచూసి, మెల్లగా అక్బర్ దగ్గరికి నడిచాడు. ఆ తర వాత తన రొండిన దోపుకుని ఉన్న నశ్యం డబ్బీని పైకితీసి, మూత తెరిచి అక్బర్‌కేసి సాచాడు. అక్బర్ చిటికెడు నశ్యం తీసుకున్నాడు. అప్పుడు బీర్బల్, "చూశారా ప్రభూ! నశ్యం ఇచ్చేప్పుడు ఇచ్చేవారి చేయి కిందా, పుచ్చు కునేవారి చేయి మీదా, ఉంటాయి. ప్రభూ!" అన్నాడు నవ్వుతూ.

భారతీయ నృత్యాలు:

# కథక్!

మాళ్వరాజ్యాన్ని పదహారవ శతాబ్దంలో యువకుడూ, కళాపోషకుడూ అయిన బాజ్ బహదూర్ పరిపాలించేవాడు. ఆయన ఒక యుద్ధంలో ఓడిపోయి నర్మద లోయలో ఉన్న మాండూ అనే అందమైన పట్టణానికి పారి పోవలసివచ్చింది. ఆయన అక్కడ రూపమతి అనే రాజపుత్ర రాకుమారిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. రూపమతి అపురూప రూపలావణ్యాలను గురించి విన్న అక్బర్ చక్రవర్తి, మాండూ కోటను ముట్టడించి ఆమెను తీసుకురమ్మని ఆగ్రా నుంచి తన సేనను పంపాడు.

ఘోరయుద్ధం జరిగింది. బాజ్ బహదూర్ పరాజితుడై తప్పించుకుని పారిపోయాడు. రాణీ రూపమతి ఆత్మాహుతి చేసుకున్నది. మొగల్ సేనలు రూపమతిని తమ వెంట తీసుకుపోలేకపోయినప్పటికీ మూడు వందలాయాభై మంది నాట్యగత్తెలను మాండూ పరిసర ప్రాంతాల నుంచి మొగల్ ఆస్థానానికి తరలించుకుపోయారు. ఆ విధంగా స్థానిక నాట్య సంప్రదాయం అక్కడికి చేరింది.

ఆనాటి భారతీయ నాట్యసంప్రదాయం, మొగల్ ఆస్థానాన్ని చేరినవైనాన్ని తెలియజేసే ఉదంతాలలో ఇదీ ఒకటి. అన్నీ విషాద ఉదంతాలు కాకపోయినప్పటికీ, చరిత్రలో ఇలాంటిసంఘటనలు చాలా జరిగాయి. స్థానిక హిందూ నాట్య సంప్రదాయం, అప్పుడప్పుడే విస్తరిస్తూన్న ముస్లిం సంప్రదాయంతో మిళితం కావడానికి దోహదం చేశాయి. విభిన్నమైన హిందూ-ముస్లిం సంస్కృతులు కలిసి కథక్ నాట్య ఆవిర్భావానికి దోహదం చేశాయి!

అక్బర్ పాలనాకాలంలో మొగల్, రాజ పుత్ర సంస్థానాల మధ్య సత్సంబంధాలు ఉండేవి. ఇవి విస్పష్టమైన ఇండో-మొగల్ కళా సంప్రదాయాల సత్వర అభివృద్ధికి దోహదం చేశాయి. అలాంటి సంప్రదాయాలలో ముఖ్యమైనది కథక్ నాట్యం!

శాస్త్రీయ నాట్యం దేవాలయాల పరిధి నుంచి రాజాస్థానాలకు చేరుకోవడాన్ని కథక్ సూచిస్తుంది.

పద్దెనిమిదవ శతాబ్దానికల్లా కథక్ విల





క్షణమైన నాట్యసంప్రదాయంగా పరిణమించింది. మిగిలిన నాట్యాలకు భిన్నంగా తనకంటూ ప్రత్యేక శైలినీ, పద్ధతులనూ సంతరించుకున్నది.

పదహారవ శతాబ్దారంభంలోనే కథక్ నాట్యకారిణులు బిగువైన చురిదార్, పైజమా ధరించేవారు. అనాటి మొగల్ చిత్రాలను దీనికి తార్కాణంగా చెప్పవచ్చు. పదహారవ శతాబ్దాంతంలో నాట్యకారిణులు గజ్జెలు అమర్చిన 'నూపురాల'నే లావుపాటి అందెలు ధరించసాగారు.

మిగిలిన నాట్యరీతులు' మెలొడీ'కి సంబంధించిన సంగీతంలోని స్వరం, రాగం అనే రెంటి మీద ఆధారపడినవి. అయితే, కథక్ తాళం మీద ఆధారపడింది. క్లిష్టమైన కదలికలకూ, సునిశితమైన, లయాత్మక పాదాల కదలికకూ కథక్ పేరుగాంచింది.

నాట్యగీతాలకు పురాణాలనుంచిముఖ్యంగా కృష్ణలీలల నుంచి వస్తువును స్వీకరించి హిందూస్థానీ శాస్త్రీయ సంగీతం సమకూరుస్తారు. తోడుగా సారంగి, తబ్లా వాయిద్యాలు ఉపయోగిస్తారు.

లక్నోకు చెందిన సుప్రసిద్ధ నాట్యకారులు మహారాజ్ బిందాదిన్, ఆయన సోదరుడు కలాకా, వారి శిష్యులు అచన్ మహారాజ్, లుచ్చూ మహారాజ్ మొదలైనవారు కథక్ నాట్యానికి అమిత ప్రాచుర్యం కలిగించారు. కథక్‌ను ఒక శక్తివంతమైన నాట్య సంప్రదాయంగా నిలబెట్టడానికి బిర్జూ మహారాజ్, శంభూ మహారాజ్ కూడాఎంతో కృషిచేశారు.

## కథక్ నాట్యవిన్యాసాలు కొన్ని...

- కథక్ నాట్యకారులు ఒక భుజంమీదికి మరొక భుజాన్ని పైకెత్తడం చేస్తూంటారు. ఈ పద్ధతిని 'కసక్ మసక్' అంటారు.
- కథక్ నాట్యకారులు ఎత్తుకు ఎగురుతూ చక్రంలా తిరుగుతూ ప్రేక్షకులను అలరిస్తారు. రెండు పాదాలను ఒక్కసారిగా పైకెత్తి కొన్ని క్షణాలు అలాగే గాలిలో నిలబడడం బహుశా ఈ కథక్ శైలిలోనే కనిపిస్తుంది. నాట్యం చివరిదశలో అంటే ఉచ్ఛఘట్టంలో చక్రంలా తిరగడం కూడా కథక్ నాట్యశైలి ప్రత్యేకతగా చెప్పవచ్చు.
- ఒక్క కథక్ శాస్త్రీయ నాట్యశైలిలోనే ప్రదర్శించే పాదవిన్యాసాలకు అనుగుణంగా, నాట్యకారిణే స్వయంగా పదాలు (బోల్స్) పాడుతుంది.

# మకర సంక్రాంతి

భారతదేశమంతటా, జనవరి నెలలో దాదాపు అన్ని ప్రాంతాలలో గొప్పగా జరుపుకునే పండుగ సంక్రాంతి.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించ డాన్ని మకరసంక్రాంతిగా చెప్పడం మన సంప్రదాయం. దానితోనే ఉత్తరాయన పుణ్యకాలం ఆరంభమవుతుంది.

ఈ ఉత్తరాయన పుణ్యకాంలో మర ణించిన వారికి జనన మరణాలులేని మోక్షం ప్రాప్తిస్తుందని మన పెద్దలు విశ్వసించారు. భీష్మ పితామహుడు కురుక్షేత్ర యుద్ధంలో క్షతగాత్రుడై, అర్జునుడు ఏర్పాటుచేసిన అంపశయ్యపై శయనించి, సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన ఈ ఉత్తరాయన పుణ్యకాలం లోనే ప్రాణాలు వదిలాడనీ, ఆ విధంగా ఆయన మోక్షప్రాప్తిని పొందాడనీ మహా భారతం పేర్కొంటున్నది.

## తమిళనాడు

తమిళులకు చాలా ప్రధానమైన పండుగ పొంగల్. పంట ఇంటికి చేరాకరైతులు 'తై' నెల మొదటిరోజున వాకిట్లో పొంగలి పెట్టి సూర్యభగ వానుడికి కృతజ్ఞతలు చెప్పుకునే పండుగ ఇది. పొంగల్ పండుగను నాలుగు రోజులపాటు జరుపుకుంటారు. దీనిని ' ఉళవర్ తిరునాళ్' అంటే రైతుల పండుగ అనడం కూడా కద్దు.

మొదటిరోజు భోగిపండుగ. ఇల్లూ వాకిలీ శుభ్రపరచి, పనికిరాని వస్తువులను తెల్లవారు జామున ఇంటి ముందుభోగిమంటలలో ఈగల బెడతారు. మనలోని బూజుపట్టిన మౌఢ్యభావా లనూ, దురాచారసంప్రదాయాలనూ వదులు కోవడానికి సంకేతంగా కూడా దీనిని చెప్పడం



కద్దు. ఆ రోజు అభ్యంగన స్నానాలు, విందు భోజనాలు చేస్తారు.

మరునాడు పొంగల్. అదేమకరసంక్రాంతి. కొత్తబట్టలు ధరించి, కొత్త కుండలలో కొత్త బియ్యం, కొత్త బెల్లం వేసి పాలుపోసి పొంగలి పెడతారు. పంటలను ప్రసాదించే సూర్యభగవానుణ్ణి ప్రార్థిస్తారు. కొన్ని గ్రామాలలో ప్రజలందరూ ఒకే చోట చేరి పెద్దపెద్ద కుండలలో పొంగళ్ళు పెట్టే సంప్రదాయం కూడా ఉన్నది.

పట్టణ ప్రాంతాలలో కూడా కొత్త బియ్యం, బెల్లం, పాలుకలిపి చక్కెరపొంగలి చేస్తారు. ఇళ్ళను శుభ్రపరిచి వాకిళ్ళలో పెద్దపెద్దముగ్గులు పెడతారు. గుమ్మాలను మామిడాకుల తోరణాలతో అలంకరిస్తారు. సూర్యుణ్ణి ఆరాధిస్తారు.

మూడవరోజు 'మాట్టుపొంగల్' అంటే పశువులపండుగఅన్నమాట. వ్యవసాయానికిముఖ్యమైనది పశుసంపద. ఆ రోజు పశువులను కడిగి పూలతో, ఆకులతో అలంకరిస్తారు. మెడలకు గంటలు కడతారు. కొమ్ములకు రంగులు పూస్తారు. వ్యవసాయ పనిముట్లను కూడా శుభ్ర పరిచి బొట్లుపెడతారు. ఆరోజు ప్రత్యేకంగా తయారుచేసిన పొంగలిని పశువులకు తినిపిస్తారు.

దక్షిణాది ప్రాంతాలలోని గ్రామాలలో యువకులు ఆంబోతులను పట్టే 'జల్లికట్టు' చాలా ముఖ్యమైన ఆకర్షణ. కొన్ని ప్రాంతాలలో పశువులను గుంపులు గుంపులుగా తరమడం కూడా చేస్తూ ఉంటారు.

పండుగలో నాలగవరోజు అంటే ఆఖరురోజు 'కాణుంపొంగల్'. అంటే, కుటుంబ సభ్యులందరూ బయలుదేరి వెళ్ళి బంధుమిత్రులను కలుసుకునే సంబరం అన్నమాట. కొన్ని జిల్లాలలో దీనిని 'కన్నిపొంగల్' గాకూడా జరుపుకుంటారు. అంటే ఆడపిల్లలు అందంగా అలంకరించుకుని ఇళ్ళముందు కోలాటాలుచేస్తూ,గొబ్బిలు (గుమ్మి)తడుతూ జానపదగీతాలు పాడతారు. గృహస్థులువారికిడబ్బులూ, కానుకలూఇస్తారు.

## ఆంధ్రప్రదేశ్

చలి, పొగమంచు, ఉషోదయ పవనాలు, హరిదాసు కీర్తనలు ముంగిట్లో గొబ్బెమ్మలు—ఇవీ తెలుగు నేలలో సంక్రాంతికి స్వాగతం పలికేవి.

భోగికి ముందుగానే ఇల్లూ, వాకిలీ శుభ్రం చేస్తారు. గోడలకు సున్నం పూస్తారు. తలుపులకు రంగులు వేస్తారు. భోగినాడు వేకువజామునలేచి భోగిమంటలు వేస్తారు. భోగిమంటల చుట్టూ కూర్చుని పాటలు పాడతారు. పిల్లలు ఆడతారు.

మకరసంక్రాంతి రోజు సూర్యుడికిపొంగళ్ళు పెడతారు. వ్యవసాయపు పనులలో తమకు సాయపడేపనివాళ్ళకు పిండివంటలతో విందు భోజనాలు పెడతారు. ఈనాములిస్తారు.



మూడవరోజు కనుమపండుగ.అంటే ఇది బంధువులనూస్నేహితులనూ కలుసుకోవడం, ఆటలతో పాటలతో గడపడం ఈరోజు ప్రత్యేకత. ఆటలపోటీలు,పందాలు, పొటేలుపందాలు, ఎడ్ల పందాలు సాధారణంగా జరుపుతూ ఉంటారు.

ఆంధ్రరాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ముక్క నుముతో పెద్దపండుగ పూర్తవుతుంది. ఈ సందర్భంగా పశువులనూ, ఎడ్లనూ అలంకరించి పూజిస్తారు. సంక్రాంతిని పెద్దపండుగ అని చెప్పు కోవడం విశేషం. అంటే పండుగలన్నిటిలోకీ పంటల ఊర్పిడి తరవాత వచ్చే ఈ నాలుగు రోజుల పండుగ చాలా గొప్పదన్నమాట!

## అస్సాం

మకర సంక్రాంతి అంటే అస్సాంలో ఆట పాటలూ, విందులూ వినోదాలూ గుర్తుకు వస్తాయి. ఇక్కడ దీనిని మాఘ్‌బిహూ, భోగాలీ బిహూ అని అంటారు. భోగ్ అంటే విందూ వినోదం అని అర్థం.

పౌస మాసం ఆఖరిరోజున అంటే పండు గకు ముందురోజైన 'రుకా' నాడు రైతులు– కోతలైపోయి బీడుగావున్న పొలాలలో గుడిసె వేస్తారు. దీనిని 'భేలా ఘర్' అని అంటారు. ఈ పండుగ కోసం దుంగలను ఒకదానిపై ఒకటి పేర్చి 'మేజీ' అనే వేదిక తయారు చేస్తారు. ఈ దుంగలచుట్టూ నాలుగువైపులా వెదుళ్ళను బిగిస్తారు. స్త్రీలు బియ్యంతో రొట్టెలూ, రుచికరమైన వంటలూ తయారు చేస్తారు. ఆ రాత్రంతా ఆ వేదిక మీద ఆట పాటలతో, వినోదాలతో సంతోషంగా గడుపు తారు. తెల్లవారగానే పుణ్యస్నానాలు చేసి పూజలు చేస్తారు. ప్రార్థనలు జరుపుతారు.



## ఇతర ప్రాంతాలలో

మనదేశంలోని మరికొన్ని ప్రాంతాలలో కూడా మకర సంక్రాంతిని జరుపుకుంటారు. పంజాబులో దీనిని 'లోహ్రి' అంటారు. ఇక్కడ కూడా పంట ఇంటికి చేరే రైతుల పండుగగానే దీనిని జరుపుకుంటారు. గ్రామం మధ్య పెద్ద మంట రగిలించి దానిచుట్టూ స్త్రీ పురుషులు సంప్రదాయ దుస్తులు ధరించి, సుప్రసిద్ధ 'భాంగ్రా' జానపద నృత్యంచేస్తారు. ఈ సందర్భంగా స్త్రీలు తమ చేతులకూ, పాదాలకూ 'మెహందీ' అనే గోరింటాకు పెట్టుకుంటారు.

పశ్చిమబెంగాల్‌లో మకరసంక్రాంతి రోజున రాష్ట్రం నలుమూలల నుంచీ యాత్రీకులు గంగానది బంగాళాఖాతంలో సంగమించే 'గంగాసాగర్' దీవులవద్దగుమికూడుతారు. ఈ సందర్భంగా అక్కడ జరిగే, ''గంగాసాగర్‌మేళా' చాలాముఖ్యమైనది. మకరసంక్రాంతి పుణ్య కాలంలో గంగాసంగమంలో స్నానం చేయడం పుణ్యప్రదమని భక్తులు విశ్వసిస్తారు.

కర్నాటకరాష్ట్రంలో కూడా మకరసంక్రాంతిని ఘనంగా జరుపుకుంటారు. పశువులనుఅలంకరిస్తారు. స్త్రీపురుషులు నూతనవస్త్రాలుధరించి, బంధుమిత్రులను కలుసుకుంటారు. చెరకు, ఎండుకొబ్బరి, పప్పులు పంచుతారు. ఈ సందర్భంగా గాలిపటాలను ఎగురవేయడం కూడా సంప్రదాయంగా వస్తున్నది.



గుజరాత్‌లోకూడా మకరసంక్రాంతి రోజున రంగురంగుల గాలిపటాలు ఎగురవేస్తారు. గుజరాతీలు మకరసంక్రాంతిని చాలా శుభ ప్రదమైన దినంగా భావిస్తారు. అందువల్ల ఆ రోజునవిద్యార్థులకు బహుమతులూ,ఉపకార వేతనాలూ, కానుకలూ ఇస్తారు.

ఇక కేరళకు వచ్చామంటే మకర సంక్రాంతితో శబరిమల అయ్యప్ప దేవాలయంలో మండల పూజలు–దూరపుకొండలమధ్య మకరజ్యోతి దర్శనంతో పరిసమాప్తమవుతాయి. లక్షలాదిమంది భక్తులు ''స్వామియే శరణం అయ్యప్ప'' అంటూ అయ్యప్పనూ, మకర జ్యోతినీ సందర్శిస్తారు.

ఇలా మకరసంక్రాంతిని మనదేశమంతటా వివిధప్రాంతాలలో విభిన్నరీతులలోజరుపుకుంటున్నారు. అవి ఆయాప్రాంతప్రజల అభిరుచులకూ, ఆచారసంప్రదాయాలకూ అనుగుణంగా ఉంటున్నాయి. అయితేఎక్కువప్రాంతాలలో దీపావళి దీపాలపండుగ అయినట్టే, మకర సంక్రాంతి పంటల పండుగ. రైతులుపడిన కష్టాలకు ఫలితంగా పంటలు ఇళ్ళకు చేరే సమయం. దానిని ప్రసాదించిన సూర్యుడికి కృతజ్ఞతలు చెప్పి ప్రార్థనలు జరపడం; ఈ ఆనందసమయంలో బంధుమిత్రులతో కలిసి హాయిగా గడపడానికి దోహదం చేయడం ఈ పండుగ విశిష్టత. అందుకే ఇది నిజంగానే పెద్దపండుగ అయింది!

## తమిళనాడు జానపదకథ

తమిళనాడు అనగానే మనకు గుర్తుకు వచ్చేవి ఏవో తెలుసా? కంచి పట్టుచీరలు, ఇడ్లీలు-దోసెలు, కర్నాటకసంగీతం, భరత నాట్యం, బ్రహ్మాండమైన దేవాలయాలు. క్రీస్తు జననానికి పూర్వమే ఇక్కడ రాజ్యాలు వెలిశాయి. ఈనాటికీ వాడుకలో ఉన్న అతి ప్రాచీనమైన ప్రపంచ భాషలలో తమిళం ఒకటి.

తమిళనాడు ఉత్తర, పడమర దిశలలో ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలనూ, దక్షిణ-పశ్చిమంలో కేరళ రాష్ట్రాన్నీ, దక్షిణంగా హిందూమహాసముద్రాన్నీ, తూర్పుగా బంగాళాఖాతాన్నీ సరిహద్దులుగా కలిగి ఉన్నది. మనదేశ దక్షిణాగ్రం కన్యాకుమారి లోనే బంగాళాఖాతం, హిందూమహా సముద్రం కలిసి ఉన్నాయి.

మనదేశంలోని పడమటికనుమలూ, తూర్పుకనుమలూ తమిళనాడులోనే కలుస్తున్నాయి. తమిళనాడులోని వేసవి విడుదులుగా పేరుగాంచిన ఊటీ, కొడైక్కానల్, యేర్కాడ్, కొత్తగిరి మొదలైన పర్వతశ్రేణులు ఇక్కడే ఉన్నాయి.

1,30,058 చ.కి.మీ. వీస్తీర్ణంతో, 6,21,10,839 జనాభా కలిగివున్న తమిళనాడు మనదేశంలోని 11వ పెద్దరాష్ట్రం.

# కంచుబిందె-వెదురుబుట్ట

తమిళనాడు దక్షిణప్రాంతంలోని ఒక మారుమూల గ్రామం పుళియంపట్టిలో మురుగయ్య, మంగమ్మ అనే భార్యాభర్తలు ఉండేవారు. మురుగయ్య మరీ పేదవాడు. వాడికి కుంటెడు పొలం లేదు. చేయడానికి ఆ పల్లెటూళ్ళో కూలి పనికూడా కరువయింది. మంగమ్మకు పొయ్యిలో పిల్లి లేవడం దుర్లభమైపోయింది. ఆమె మాటి మాటికీ భర్తతో, "దమ్మిడీ సంపాదనలేకుండా నువ్వింట్లో కూర్చుంటే, నేను మా తల్లిగారింటికి వెళ్ళక తప్పదు," అంటూండేది. మురుగయ్య మారు మాట్లాడలేక మౌనంగా ఉండిపోయేవాడు.

ఒకనాడు తెల్లవారగానే, మంగమ్మ రాత్రి మిగిలిన చద్దన్నంలో మజ్జిగ కలిపి, నంజుకోడానికి పచ్చిమిరపకాయ పెట్టి, మూటకట్టి భర్త



చేతికిచ్చి, ''ఇంట్లో బియ్యపుగింజ లేదు. ఈ చద్దన్నం మూటతో పట్నం వెళ్ళి, ఏదైనా పని చేసి నాలుగుడబ్బులు సంపాయిస్తే తప్ప తిరిగి రావద్దు,'' అన్నది.

మురుగయ్య అన్నం మూటను భుజానికి తగిలించుకుని, తన దుస్థితికి విచారిస్తూ, పట్నంకేసి బయలుదేరాడు. బారెడు పొద్దెక్కే సరికి ఎండ వేడెక్కింది. మురుగయ్య, మరి కొంతదూరం నడిచి, ఎండవేడికి తట్టుకోలేక దారిపక్కనే ఉన్న పెద్ద చింతచెట్టు నీడలో చతికిల బడ్డాడు. ''ఇక్కడే కొంతసేపు సేదతీరి, చద్దన్నం తిని, ఎండ చల్లబడ్డాక బయలుదేరదాం,'' అనుకుంటూ వాడు భుజంమీది చద్దన్నం మూటను, నేలబారుగా ఉన్న చింతకొమ్మకు గట్టిగా వేలాడకట్టి, చెట్టుబోదెకు ఆనుకుని నడుం వాల్చాడు. కొంతసేపటికి అలాగే నిద్ర పోయాడు.

ఆ చింతచెట్టు మీద ఒక ముసలి రాక్ష సుడు ఉంటున్నాడు. చింతకొమ్మకు వేలాడు తూన్న మూటను చూసి, అంత జాగ్రత్తగా కట్టాడు అందులో ఏముంటుందబ్బా అను కుంటూ కిందికి దూకి, దానిని విప్పి చూశాడు. చద్దన్నం వాసన గుప్పుమన్నది. ''ఆహా! అద్భుత మైన వాసన!'' అనుకుంటూ, అందులోని పచ్చిమిరపకాయను కసుక్కున కొరికి, గుప్పె డన్నంతీసి నోట్లో వేసుకున్నాడు. ''ఆహా! ఏమి రుచి! ఏమి రుచి!'' అంటూ మజ్జిగన్నం అంతా తినేశాడు.

అంతా ఖాళీ అయ్యాక, ''అయ్యో పాపం! పేదవాడి అన్నం అంతా తినేశానే! వాడు నిద్ర లేచాక ఏం తింటాడు పాపం! ఆకలితో అలమ టించిపోడూ?'' అనుకుంటూ రాక్షసుడు అద్భుతశక్తిగల ఒక కంచుబిందెను సృష్టించి, ''ఇది నీకు మేలుచేస్తుంది!'' అని గుర్రుపెట్టి నిద్రపోతూన్న మురుగయ్యతో చెప్పి, దానిని




గుడ్డలో చుట్టి కొమ్మకు వేలాడదీసి మాయ మయ్యాడు.

కొంతసేపటికి మురుగయ్య నిద్రలేచాడు. ఉత్సాహంతో, అన్నం మూటను అందుకుని విప్పాడు. అందులో భార్య మంగమ్మ కట్టిపంపిన అన్నానికి బదులు కంచుబిందె కనిపించడంతో తీరని ఆశాభంగానికి గురయ్యాడు. దాన్ని అటూ ఇటూ తిప్పిచూసి, కోపంతో నేలకేసి కొట్టాడు. ఖంగుమన్న శబ్దంతో అది పక్కకు దొర్లుకుంటూ వెళ్ళింది. అందులోనుంచి ఒక దేవత పుట్టి, వాడి ఎదుట బంగారం పళ్ళెంలాంటి లేత అరటి ఆకు వేసి, పంచభక్ష్య పరమాన్నాలు వడ్డించి మాయమయింది. మురుగయ్య తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఆకలి మండి పోతూండడంతో మరేదీ ఆలోచించకుండా కడుపు నిండా తిన్నాడు.

ఆ తరవాత కొన్ని క్షణాలలో వాడు తిన్న ఆకు శుభ్రమైపోయింది. కంచుబిందె దానంతటదే వాడి ఎదుటికి వచ్చింది. మురుగయ్య



## పండుగలూ-పర్వాలూ

**పొంగల్:** ఈ ప్రాంతంలో ప్రధానమైన పండుగ పొంగల్(సంక్రాంతి). పంటలనూర్పిడి కాలంలో వచ్చే ఈ పండుగను నాలుగురోజుల పాటు ఘనంగా జరుపుకుంటారు. దక్షిణాది జిల్లాలలో యువకులు ఆంబోతులను పట్టే 'జల్లిక్కట్టు'ను జరుపుతారు.

**చైత్రోత్సవం:** చిత్తిరైవిళా అనే చైత్రోత్సవాన్ని 'చిత్తిరై' (చైత్రం) నెలలో మధురైలో వైభవంగా జరుపుతారు. చైత్ర పౌర్ణమి రోజున మీనాక్షీ (పార్వతి) సుందరేశ్వరుల (పరమశివుడు) వివాహాన్ని రంగరంగవైభవంగా జరుపుతారు.

యేటా చిదంబరంలోనూ, మహాబలిపురంలోనూ నాట్యోత్సవాలు జరుగుతాయి. తమిళనాడులో జరిగేసాంస్కృతికకార్యక్రమాలలో వీటికి ప్రముఖస్థానం ఉంది. దేశం నలుమూలల నుంచి సుప్రసిద్ధనాట్య కళాకారులు ఈ ఉత్సవాలలో పాల్గొంటారు. మహాబలి పురంలో పదమూడవ శతాబ్దంలో నిర్మించబడిన సముద్రతీరంలోని ఏకశిలా దేవాలయం ముందు బహిరంగ ప్రదేశంలో వేదికను ఏర్పాటుచేస్తారు.

చిదంబరంలోని సుప్రసిద్ధ నటరాజమందిరంలో నృత్యోత్సవాలు ఏర్పాటు చేస్తారు. ఈ దేవాలయంలోని స్తంభాలమీద భరతనాట్యంలోని 108 భంగిమలు శిల్పాలుగా మలచబడిఉన్నాయి!

దానిని అందుకుని బట్టలో చుట్టుకుని, అది అదృశ్యమైపోయేలోగా ఇల్లు చేరుకోవాలని వేగంగా తిరుగుముఖం పట్టాడు.

వాణ్ణి చూడగానే మంగమ్మకు పట్టరాని కోపం వచ్చింది. ఒక్కరోజులోనే తిరిగి వచ్చేశాడన్న బాధతో తిట్ల దండకం అందుకోబోయింది. అయితే, మురుగయ్య, "నోర్మూయ్!" అంటూ వేసిన కేకతో వాడి భార్య తెరిచిన నోరు మూయకుండా ఆశ్చర్యంతో అవాక్కయిపోయింది. వాడు ఇంటి లోపలికి వెళ్ళి కంచుబిందెను నట్టింటపెట్టి, దాన్ని చేత్తో గట్టిగా కొట్టి దేవతను భోజనం వడ్డించమన్నాడు. మరుక్షణమే ఆ పాత్ర నుంచి దేవత వెలువడి, రెండు లేత అరిటాకులలో విందుభోజనం వడ్డించింది. ఇద్దరూ తృప్తిగా భోజనం చేశారు.

తరవాత మురుగయ్య, భార్యకు జరిగిందంతా వివరించి, చద్దన్నం మూటలోకి కంచు బిందెఎలావచ్చిందో విచిత్రంగా ఉందని చెప్పాడు. ఆఖరికి, ఎలావస్తే ఏం? అది దేవుడు తమపై కరుణించి తమకు ప్రసాదించిన వరం గనక, గ్రామంలోని పేద వాళ్ళందరికీ విందుభోజనం పెట్టాలని ఇరువురూ నిర్ణయించారు. "ఆహా! రేపటి నుంచి మన గ్రామంలోని పేదవాళ్ళందరికీ విందు భోజనాలే!" అంటూ పట్టరాని



ఆనందంతో మురిసి పోయింది మంగమ్మ.

మరునాడు తెల్లవారగానే, వాళ్ళు ఒక్కొక్కరి ఇంటికీ వెళ్ళి తలుపు తట్టి విందుకు రమ్మని పిలిచారు.

పూట గడవడమే గగనంగా ఉన్న మురుగయ్య దంపతులు విందుకు పిలవడం ఏమిటా అని అందరూ విస్తుపోయారు. కొందరయితే పరిహసించారుకూడా. అయినా, వెళ్ళి చూడడం వల్ల పోయేదేంలేదుకదా అని అందరూ వచ్చారు. ఇల్లు అలంకారాలతో కళకళలాడుతోంది. మురుగయ్య దంపతులు వాకిట్లో చేతులు జోడించుకుని నిలబడి, "రండి! రండి!" అంటూ అందరినీ ఆహ్వానించారు.

అందంగా అలకరించుకున్న దేవతలు వరసగా అరిటాకులు వేసి, తళతళా మెరిసే వెండి లోటాలలో నీళ్ళు పెట్టారు. అందరూ కూర్చోగానే క్షణంలో వడ్డించారు. వేడివేడి మసాలావడలు, అప్పడాలు, పాలపాయసం, మల్లెపువ్వులాంటి అన్నం, ఆవిరులు చిమ్మే సాంబారు, వేపుళ్ళు, అవియల్, గడ్డపెరుగు అంటూ వాళ్ళెప్పుడూ కనీ వినీ ఎరుగని విందు బ్రహ్మాండంగా జరిగింది!

ఆ రోజంతా గ్రామంలో ఆడా మగా, పిల్లలూ పెద్దలూ ఆ విందు గురించే గొప్పగా మాట్లాడుకోసాగారు.

అయితే పుళియంపట్టిలో ఉన్న వడ్డీవ్యాపారి ఆ విందుకు వెళ్ళలేదు. ఆ గొప్ప విందును గురించి గ్రామస్థులు పొద్దస్తమానం చెప్పుకోవడం వింటూంటే అతడు ఒకవైపు అసూయతో, మరొకవైపు మురుగయ్య ఇలాంటి విందు ఎలా ఇవ్వగలిగాడో తెలుసుకోవాలన్న ఉబలాటంతో కుతకుతలాడిపోయాడు. మరునాడు తెల్లవారగానే మురుగయ్య ఇంటికి వెళ్ళి, వాడి భార్యతో మంచిగా మాట్లాడి విందుభోజన

## పట్టుపరిశ్రమ

తమిళనాడు పట్టుపరిశ్రమ ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. కాంచీపురంలో పట్టు చీరలు భారీఎత్తుననేస్తారు. ఆకర్షణీయమైన రంగులతో, నాణ్యమైన నేతతో, మన్నికకు పేరుగాంచినవి కాంచీపురం పట్టుచీరలు. ఇవి బంగారం జరీతో కళకళలాడుతూ ఉంటాయి. కంచిలో పట్టుపరిశ్రమ 400 సంవత్సరాలకు పైగా సాగుతున్నదని చెబుతారు.





రహస్యం రాబట్టాడు. తనుకూడా ఎలాగైనా రాక్షసుడి నుంచి ఒక కంచుబిందెను సాధించాలని తీర్మానించాడు.

హడావుడిగా ఇంటికి వెళ్ళి భార్యకు సంగతి చెప్పి, రుచికరమైన వంట చేయించాడు. దానిని ఒక పెద్ద పాత్రలో వేసుకుని, కాలినడకనే వెళ్ళి రాక్షసుడున్న చింతచెట్టు కింద కూర్చున్నాడు. చెట్టంతా, చుట్టుపక్కలా చూపులతో వెతికాడు. రాక్షసుడి జాడ కనిపించలేదు. మరికొంతసేపు కూర్చున్నాడు. ఎంతసేపటికీ రాక్షసుడు రాలేదు. వడ్డీ వ్యాపారికి ఓర్పు నశించింది. "ఇంకా రాలేదు. ఎక్కడికెళ్ళి చచ్చాడీ వెధవ రాక్షసుడు?" అని మనసులో అనుకుంటూన్నవాడిలా గట్టిగా పైకి అనేశాడు. ఆ మాటలు అదే చెట్టుమీద గుబురు కొమ్మల మధ్య కూర్చుని కునికిపాట్లు పడుతున్న ముసలి రాక్షసుడి చెవిలో పడ్డాయి. ఈ పొగరుబోతు వ్యాపారికి

# దేవాలయాలు

తమిళనాడులోని దేవాలయాలు జగత్ప్రసిద్ధిగాంచాయి. ఇక్కడ ఉన్నన్ని బ్రహ్మాండమైన దేవాలయాలు మరెక్కడా లేవని చెప్పవచ్చు. తంజావూరులోని బృహదీశ్వరాలయాన్ని మొదటి రాజరాజ చోళుడు (క్రీ.శ. 985-1013) లో నిర్మించాడు. విలక్షణమైన దేవాలయ నిర్మాణకళకు ఇది ప్రసిద్ధి గాంచింది. ఆలయ విమానం ఏకశిలా నిర్మితం. దాని నీడ నేలపై పడకుండా నిర్మించబడి ఉన్నది.

మధురైలోని మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయం రోజూ భక్తులనూ, పర్యాటకులనూ



ఆకర్షిస్తున్నది. ఇదొక శివపార్వతుల ఆలయం.

కంచిలోని ఏకాంబరేశ్వర ఆలయం చాలా ప్రాచీనమైన, బ్రహ్మాండమైన శివాలయం. శివుడు ఇక్కడ పంచభూతాలలో ఒకటైన "పృథ్వీ" లింగంగా ఆరాధించబడుతున్నాడు.

తగిన గుణపాఠం నేర్పాలని నిర్ణయిం చాడు. కొంతసేపటికి వ్యాపారి అలాగే నిద్ర పోయాడు.

రాక్షసుడు చెట్టుపై నుంచి కిందికి దూకి, వడ్డీ వ్యాపారి తెచ్చిన అన్నం పాత్రను మాయం చేసి దానిస్థానంలో ఒక వెదురు బుట్టను సృష్టించాడు.

కొంతసేపటికి వడ్డీవ్యాపారి నిద్రలేచి, ఆశతో చుట్టుపక్కల కలయజూశాడు. ఎదురుగా వెదురుబుట్ట కనిపించడంతో ఒక్క క్షణం గతుక్కు మన్నాడు. అయినా, తాను తెచ్చింది చద్దికూడు; పచ్చిమిరపకాయ కాదు. రుచికరమైన వంట కాలు! ఈ వెదురుబుట్ట, మురుగయ్య కంచు బిందె కన్నా మహిమకలదై ఉంటుందన్న ఆశతో, దానినెత్తుకుని సంతోషంగా ఇల్లు చేరాడు.

మరునాడు అతడు తన బంధుమిత్రులను విందుకు ఆహ్వానించాడు. పిలిచినవారందరూ ఉత్సాహంగా వచ్చారు. అతడు వెదురుబుట్టతో, "వడ్డించు! నా బంధుమిత్రులందరికీ విందు భోజనం వడ్డించు!" అన్నాడు.

మరుక్షణమే పెద్దపెద్ద మీసాలతో, కండలు తిరిగిన నలుగురు దృఢకాయులు బుట్టలో

## పర్యాటక స్థలాలు

తమిళనాడు అనగానే మన మనసుల్లో కదలాడేవి ఆకాశాన్నంటే గోపురాలతో వెలసే బ్రహ్మాండమైన దేవాలయాలు. దేవాలయాలే కాకుండా తమిళనాడులో చూడదగిన స్థలాలు చాలా ఉన్నాయి. చెన్నయ్ లోని మెరీనా బీచ్ ప్రపంచంలోనే రెండవ పొడవైన సముద్ర తీరం. అంతేకాక, సముద్రతీరం పొడవునా ఆకర్షణీయమైన పలు పర్యాటక కేంద్రాలు ఉన్నాయి.

తమిళనాడు-కర్నాటకసరిహద్దులోని హొగెనెకల్ జలపాతం మరొక ముఖ్యమైన ఆకర్షణ. కావేరీనది ఇక్కడరెండుపాయలుగా చీలుతుంది. ఒక పాయ మామూలుగా ప్రవహిస్తుంది. మరొకపాయ అగాధంలో పడి అందమైన జలపాతాలను సృష్టిస్తోంది. ఎన్నో ఔషధ మూలికలుగల అరణ్యాల గుండాప్రవహించడంవల్ల ఇక్కడి కావేరిలో స్నానంచేయడం ఆరోగ్యప్రదమనిచెబుతారు.



నుంచి పుట్టుకువచ్చారు. ఒక దృఢకాయుడు వడ్డీవ్యాపారినీ, మిగిలినవారు అతిథులనూ వడిసి పట్టుకుని, తలలు గొరిగి, నాలుగు తన్ని అక్కడి నుంచి తరుమగొట్టారు!

"అయ్యో! గుండు చేసేశాడే! బోడిగుండు చేసేశాడే!" అంటూ అందరూ వాపోతూ అక్కడి నుంచి పారిపోయారు.

వడ్డీవ్యాపారి ఇచ్చిన ఈ విందును గురించి కూడా గ్రామంలో అందరూ మాట్లాడుకుంటూ పగలబడి నవ్వసాగారు!

ఆ అవమానం నుంచి తప్పించుకోవడానికి వడ్డీవ్యాపారి కాశీయాత్రకు బయలుదేరాడు!

# మనదేశం గురించి తెలుసుకుందాం!

క్విజ్

మళ్ళీ ఒక రిపబ్లిక్‌దినం వచ్చేసింది. ఈ జనవరి 26 వ తేదీ 51వ రిపబ్లిక్ దినోత్సవాలను జరుపుకోనున్నాము. పరాయిపాలన నుంచి విముక్తిపొంది సర్వతంత్ర స్వతంత్రరాజ్య సాధనకు సుదీర్ఘకాలం పోరాడిన సంగతి అందరికీ తెలిసినదే. స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన విషయాలను ఈనెల క్విజ్ మీ ముందుకు తెస్తోంది.

1. 'భారతీయ పోరాటం' (ది ఇండియన్ స్ట్రగుల్) పుస్తక రచయిత ఎవరు?
2. 'సత్యాగ్రహం' అనే మాటను మొట్టమొదట ఉపయోగించినవారెవరు?
3. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, గాంధీజీని ప్రప్రథమంగా ఎక్కడ ఎప్పుడు కలుసుకున్నాడు?
4. లాల్,బాల్,పాల్ అని జాతీయనాయకులు ముగ్గురు ప్రసిద్ధులయ్యారు. వారెవరు?
5. బెంగాల్ – బెంగాల్, తూర్పు బెంగాల్‌గా ఎప్పుడు విభజించబడింది?
6. ఈస్ట్ ఇండియా కంపెనీ తన అధికారాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి ఎప్పుడు అప్పగించింది?
7. భారత జాతీయకాంగ్రెస్, భారత స్వాతంత్ర్యంకోసం ఎక్కడ ఎప్పుడు తీర్మానం చేసింది?
8. సైమన్ కమిషన్ మనదేశానికి ఎప్పుడు వచ్చింది? దాని లక్ష్యం ఏమిటి?
9. 'తాత్కాలిక ప్రభుత్వం' ఎప్పుడు ఏర్పాటయింది?
10. ''స్వాతంత్ర్యం నా జన్మహక్కు. దానిని సాధించి తీరుతాను,'' అని గర్జించిన సుప్రసిద్ధ నాయకుడు ఎవరు?

(సమాధానాలు వచ్చే సంచికలో)

## డిసెంబర్ క్విజ్ సమాధానాలు

1. 2000 మే 11.
2. కాంచన్ జంగ–8,598 మీ. (208 అడుగులు).
3. సింధునది; దాని ఉపనదులైన జీలం, చీనబ్,రావి, సట్లజ్.
4. ఉత్తరాంచల్ – డెహ్రాడూన్; చట్టీస్‌ఘడ్–రాయ్‌పూర్, ఝార్ఖండ్–రాంచీ.
5. తమిళనాడు. జానకి రామచంద్రన్; జె.జయలలిత.

# 24. కాళిదాసు శాకుంతల నాటకం!



''తాతయ్యా! మా పాఠశాలవార్షికోత్సవసందర్భంగా కాళిదాసు రచించిన ఒక నాటకాన్ని ప్రదర్శించ బోతున్నాం. రేపు ఆదివారం సెలవురోజు అయిన ప్పటికీ, మమ్మల్ని ఆడిటోరియంలో హాజరు కమ్మని చెప్పారు. బహుశా మేము ధరించవల సిన పాత్రలను గురించి చెబుతారనుకుంటాను,'' అన్నాడు సందీపుడు బడినుంచి వస్తూనే అమి తోత్సాహంతో.

''అభిజ్ఞాన శాకుంతలమా?'' అని అడి గాడు దేవనాధుడు.

''అవును. అది మీరెలా అంత సరిగ్గా చెప్ప గలిగారు?'' అని అడిగాడు సందీపుడు.

''కాళిదాసు రచించిననాటకాలలో ఇది చాలా ప్రసిద్ధమైనది. విక్రమోర్వశీయం, మాళవికాగ్ని మిత్రం అనే మిగిలిన రెండు నాటకాలను వేదిక మీద ప్రదర్శించడం అంత సులభంకాదు. పైగా సంస్కృతంలో తప్ప మరే భాషలో ఆ నాటకాలు ప్రదర్శించినా అంతగా శోభించవు. అవునూ, మీరు మూలభాష అయిన సంస్కృ తంలోనే నాటకం ప్రదర్శిస్తున్నారా, లేదా?'' అని అడిగాడు దేవనాధుడు.

''లేదు, తాతయ్యా'' అన్నాడు సందీపుడు.

''ఎందుకని?'' అడిగాడు దేవనాధుడు.

''సంస్కృతం చాలా కష్టం కదా, తాతయ్యా,'' అన్నాడు సందీపుడు.

''అలా అని ఎవరన్నారు? అది కష్టం అనుకో వడం చాలా పాతబడిన భావం. ఒకప్పుడు సంస్కృతాన్ని బోధించిన ఉపాధ్యాయులు

విశ్వావసు



తాతయ్య చెప్పే కథ నేనొక్కణ్ణే వింటాను అన్నాడు సందీపుడు.

"మొదట ఇద్దరూ వెళ్ళి, బట్టలు మార్చుకుని కాళ్ళూ చేతులూ కడుక్కుని, ఫలహారం తిని నెమ్మదిగా రండి. ఈలోగా తాతయ్య కాస్సేపు విశ్రాంతి తీసుకుంటారు," అన్నది వాళ్ళ తల్లి జయశ్రీ.

పిల్లలిద్దరూ వెళ్ళి అరగంట తరవాత తిరిగి వచ్చారు. తాతయ్య దేవనాధుడు కాస్సేపు కళ్ళు మూసుకుని శకుంతల నాటకాన్ని జ్ఞాపకం తెచ్చుకుని, కథ చెప్పడం ప్రారంభించాడు:

ఒక రసవత్తరమైన సన్నివేశంతో నాటకం ఆరంభమవుతుంది. హస్తినాపురం రాజు దుష్యంతుడు అరణ్యంలో వేటాడుతూ, ఒక లేడిని తరుముకుంటూ వెళతాడు. అది ఆయన్ను కణ్వముని ఆశ్రమం దగ్గరికి తీసుకు వెళుతుంది. శకుంతల ఆయన కంటబడుతుంది. మేనకా విశ్వామిత్రుల కుమార్తెఅయిన శకుంతల అందాలరాశి; సుగుణాలవెల్లి. ఆమెను కణ్వ మహర్షి పెంచి పెద్ద చేశాడు. యుక్తవయస్కురాలైన శకుంతల ఆశ్రమం ఎదుట కూర్చుని ఉండగా ఒక తుమ్మెద ఆమెకు మాటిమాటికీ ఇబ్బంది కలిగిస్తోంది. దానిని చూసి గడుసురాలైన ఆమె చెలికత్తె, "సాక్షాత్తు దుష్యంత మహారాజు పాలనలోనే ఒకతుమ్మెద ఒక యువతీ రత్నాన్ని ఎలా వేధించగలుగుతున్నది?" అని ఎగతాళిగా అన్నది. సరిగ్గా ఆ సమయానికే, ఆపదలో ఉన్న మునికుమారిని కాపాడడానికి దుష్యంతుడు అక్కడికి వచ్చాడు!

ఆ సమయంలో కణ్వుడు ఆశ్రమంలో లేడు. అందువల్ల శకుంతలే ఆయనకు అతిథి మర్యాదలు చేసింది. దుష్యంతుడు కొంతసేపు అక్కడే విశ్రాంతి తీసుకున్నాడు. ఇరువురి చూపులు కలిసినప్పుడే, మనసులూ కలిశాయి. గాంధర్వవివాహం చేసుకున్నారు. దుష్యంతుడు

కష్టమైన పద్ధతులను అవలంబించడం వల్ల అది కష్టంగా అనిపించింది. ఇప్పుడు కొత్త పద్ధతులు వాడుకలోకి వచ్చాయి. అందువల్ల సంస్కృతం నేర్చుకోవడం చాలా సులభం. సంస్కృతం ఇచ్చే ఆనందానుభూతి సాటిలేనిది. సరి, అది వేరే విషయం. ఇంతకూ, నువ్వు శాకుంతల నాటకంలో ఏం వేషం వేయబోతున్నావు?" అన్నాడు దేవనాధుడు.

"నాకు తెలియదు. అది రేపే నిర్ణయమవుతుంది. ఈలోగా ఆ కథను క్లుప్తంగా చెబుతావా తాతయ్యా?" అన్నాడు సందీపుడు.

"ఏ పాత్ర అని నిర్ణయించడంలో పెద్ద కష్టం ఏం వుంటుందిలే. ఒక నాటకం అన్నాక విదూషకుడు లేకుండా ఉంటాడా? ఆ విదూషకుడి పాత్ర నీకే లభిస్తుంది," అంటూ గదిలోకి అడుగు పెట్టింది సందీపుడి చెల్లెలు శ్యామల నవ్వుతూ.

"సరే, అలాగే రానీ. అంటే నీకు ఈ కథ తెలుసునన్నమాట. మళ్ళీ వినొద్దు, వెళ్ళిపో.



కొన్నాళ్ళు అక్కడే సంతోషంగా గడిపాడు. ఆశ్రమ పరిసరాలలోని దుష్టమృగాలనూ, దుష్టరాక్షసులనూ తరుమగొట్టాడు. ఆయన తన చేతి ఉంగరాన్ని శకుంతలకు కానుకగా ఇచ్చి పాలనా వ్యవహారాలు గమనించడానికి రాజధాని హస్తినాపురానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

ఒకనాడు శకుంతల పూలమాల కడుతూ, మనసులో దుష్యంతుణ్ణి గురించి ఆలోచిస్తూం డగా, దుర్వాసముని ఆశ్రమానికి వచ్చాడు. కణ్వమునిని గురించి అడిగాడు. అయినా శకుంతల దుష్యంతుణ్ణి గురించిన ఆలోచన లతో మైమరచి ఉండడంవల్ల, ముని వచ్చిన విషయంగానీ, ఆయన తన తండ్రిని గురించి అడిగిన సంగతిగానీ ఆమెకు తెలియలేదు. దుర్వాసుడు ఆగ్రహం చెంది, ''ఎవరిని గురించిన ఆలోచనలలో మునిగి నన్ను అశ్రద్ధచేసి, అవ మానించావో, వారే నిన్ను గుర్తించలేక పోదురు గాక!'' అని శపించాడు.

శకుంతలకు ఆ శాపం గురించి కూడా తెలి యదుగాని, ఆమె చెలికత్తె, మునికి క్షమాప ణలు చెప్పి, శాపాన్ని ఉపసంహరించుకోమని ప్రార్థించింది. ముని శాంతించి, శాప ప్రభావం కొన్నాళ్ళే ఉంటుందనీ, అది తాత్కాలికమేనని చెప్పి వెళ్ళిపోయాడు. అయితే ఈ సంగతులేవీ శకుంతలకు తెలియవు.

ఆ తరవాత కొన్నాళ్ళకు కణ్వుడు ఆశ్ర మానికి తిరిగి వచ్చి, శకుంతలా దుష్యంతుల వివాహం గురించి విని సంతోషించాడు. శకుంతల త్వరలో తల్లికాబోతున్నది. పెంచి పెద్దచేసిన కుమార్తెను శాశ్వతంగా విడిపోతున్నానన్న బాధతో, బరువెక్కిన మనసుతో, సజల నయనా లతో కణ్వముని శకుంతలను భర్త దగ్గరికి సాగనంపాడు.

దుర్వాసముని శాపకారణంగా శకుంతలను దుష్యంతుడు గుర్తించి స్వీకరించలేక పోయాడు. పైగా శకుంతల పడవలో నదిని దాటుతున్న ప్పుడు దుష్యంతుడు ఆమెకిచ్చిన ఉంగరం కూడా నదీజలాలలో పడిపోవడంవల్ల, ఆమె

వివాహానికి సంబంధించిన ఆనవాలు కూడా చూపలేకపోయింది!

శకుంతల అవమాన భారంతో కుమిలి పోయింది. తల్లి మేనక ఆమెనొక మునిఆశ్రమానికి చేర్చింది. అక్కడ శకుంతల ఒక మగ బిడ్డను ప్రసవించింది.

ఒకనాడు నదిలో చేపలు పట్టే జాలరికి ఒక చేప కడుపున ఉంగరం ఒకటి కనిపించింది. వాడు దానిని తెచ్చి దుష్యంతమహారాజుకిచ్చాడు. దానిని చూడగానే ఆయనకు శకుంతల పరిణయ వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. శకుంతలకు తాను చేసిన అన్యాయానికి ఆయనెంతో పశ్చాత్తాపం చెందాడు. ఆమెకోసం ఎక్కడెక్కడో వెతికాడు. అయినా, ఆమెజాడ తెలుసుకోలేకపోయాడు.

ఒకనాడు దుష్యంతుడు కశ్యపముని ఆశ్రమానికి వెళ్ళి, అక్కడొక పసివాడు సింహపు కొదమలతో ఆడుకోవడం చూసి అమితాశ్చర్యం చెందాడు. ఆ తరవాత, అక్కడున్న శకుంతలను చూసి ఆ కుర్రవాడు తన తనయుడేనని గ్రహించాడు. ఆ తరవాత ఆమెనూ, బిడ్డనూ తన వెంట రాజధానికి తీసుకువచ్చాడు. ఆనాడు సింహపు కొదమలతో ఆడుకున్న శకుంతలా-దుష్యంతుల కుమారుడు భరతుడు పెరిగి పెద్దవాడై, యావత్ భారతదేశాన్ని చక్రవర్తిగా పరిపాలించాడనీ, అందువల్లే మనదేశానికి భరతవర్షం, భారతదేశం అనే పేర్లు వచ్చాయనీ చెబుతారు.

దేవనాథుడు ఈకథ చెప్పడం పూర్తిచేశాక, కొంతసేపు మౌనంవహించి మళ్ళీ ఇలా అన్నాడు:

"మహాకవి కాళిదాసు కవితావైభవాన్ని గురించి మన కవులూ, పండితులూ ఎంతగానో శ్లాఘించారు. ఒక జర్మను మహాకవి ఆయన్ను గురించి ఏం చెప్పాడో చూడండి:"

"నవయౌవన పుష్పాలు ఆఘ్రాణించాలా?
జీవిత పరిపక్వ ఫలాలను ఆస్వాదించాలా?
పరమాద్భుత సౌందర్యానుభూతి పొందాలా?
భువినీ,దివినీ ఒక్కమాటలో అభివర్ణించాలా?
అభిజ్ఞాన శాకుంతలం చదవండి!
సర్వాభీష్టాలు తీర్చి, సంతృప్తి పరుస్తుంది
చూడండి!!" —(ఇంకావుంది)





# మాయావీణ

పూర్వం ఒక ఊళ్ళో, ఒకసంగీతవిద్వాంసుడు వుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. తండ్రీకొడుకులు కలిసి కచేరీలు చేసి, తమ కుటుంబాన్ని పోషించుకునేవారు. కొంతకాలానికి ఆ విద్వాంసుడికి ఏదో వ్యాధి సోకి చేతివేళ్ళు వంకర్లుపోయాయి. నోటమాట కూడా పడిపోయింది. ఆ ఊరి వైద్యుడు వచ్చి పరీక్షించి, "ఇది సామాన్యమైన వ్యాధికాదు. దీన్ని అపరధన్వంతరిగా పేరు తెచ్చుకున్న రాజవైద్యుడు తప్ప, నాలాంటి వాళ్ళు నయం చేయలేరు. రాజ వైద్యుడితో చికిత్స అంటే, ముందు మూర్ఖుడైన మన రాజును మెప్పించగలగాలి. రాయినైనా మెప్పించగలంగాని, ఈ దేశపురాజును మెప్పించలేమని అందరూ అంటూంటారు గదా! అందుకని, ఈ చికిత్స జరిగి మీ నాన్న బాగుపడతాడనే నమ్మకం నాకు లేదు. అయినా ప్రయత్నించిచూడండి. భగవత్ కృప, మీ అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది!" అన్నాడు.

ఆ మాట విని విద్వాంసుడి ముగ్గురు కొడుకుల్లో పెద్దవాడు, "రాజు ఎంత మూర్ఖుడైనా నా వీణావాదంతో మెప్పించి, రాజవైద్యుణ్ణి తీసుకువచ్చి, నాన్నగారి జబ్బు నయంచేయిస్తాను!" అని వీణ తీసుకుని రాజధానికి బయలుదేరాడు.

వాడు రాజును కలిసి, "ప్రభూ, వీణ వాయించడంలో నాకున్న ప్రతిభతో మిమ్మల్ని రంజింపజేస్తాను. ప్రతిగా రాజవైద్యుడిచేత, మా నాన్నగారికి చికిత్స చేయించండి," అన్నాడు.

రాజు నవ్వి, "వీణవాయించడం ఈ దేశంలో నీకేకాదు, మా కాపలాభటుడికికూడా తెలుసు. అంతగా నీ కోరిక తీరాలంటే ఒకపని చెయ్యి. వీణావాదంలో నన్నుమించినవాడులేడని ప్రజలు అంటూంటారు కాబట్టి, నాతో పందెం కాయి. నన్ను గెలిస్తే నీ కోరిక తీరుతుంది. నేను గెలిస్తే మాత్రం, నీకు లభించేది పాతికకొరడాదెబ్బల శిక్ష! ఈ పోటీకి ప్రజలేన్యాయనిర్ణేతలు కూడా," అన్నాడు.

మల్లవరపు మనోహరరెడ్డి



ఈ షరతుకు పెద్దవాడు అంగీకరించిన మీదట, ఆ మర్నాడే రాజుతో వాడికి వీణా వాదంలో ప్రజల సమక్షాన పోటీ జరిగింది. ఈ పోటీలో పెద్దవాడు, రాజును మించిన నైపుణ్యాన్ని ప్రదర్శించినప్పటికీ, ప్రజలు రాజుకు భయపడి, ఆయనకే జేజేలు పలికారు. ఫలితంగా, పెద్దవాణ్ణి పోటీలో ఓడినట్టు ప్రకటించి కొరడాతో కొట్టి పంపించారు.

ఒళ్ళంతా దెబ్బలతో ఇల్లు చేరిన పెద్దవాణ్ణి చూడగానే చిన్నవాళ్ళిద్దరూ హతాశులయ్యారు. జరిగింది తెలుసుకుని రెండోవాడు, "ఈ రోజుల్లో వీణ వాయించడం సర్వసాధారణమైపోయింది. కాబట్టే రాజు నిన్నోడించగలిగాడు. అదే మృదంగం అయితే, రాజు కాదుగదా రారాజు కూడా నన్ను ఢీకొనలేడు. అందుకే, ఈ మృదంగంతో రాజును మెప్పించి, రాజవైద్యుణ్ణి తీసుకువస్తాను," అని, మృదంగం తీసుకుని బయలుదేరాడు.

వాడు రాజదర్శనం చేసుకుని, "ఈ మృదంగ వాయిద్యంలో నన్ను తలదన్నేవాడే లేడు. కావాలంటే పరీక్షించి, మా తండ్రికి రాజవైద్యుడిచేత వైద్యం చేయించండి," అన్నాడు.

రాజు వాడి కేసి పరీక్షగా చూసి, "చూడబోతే నువ్వు మొన్న వీణావాయిద్యంలో నా చేతుల్లో ఓడిపోయి కొరడా దెబ్బలు తిన్నవాడికి తమ్ముడిలా వున్నావు. నేను సంగీత సమ్రాట్టును! ఇది జగమెరిగిన సత్యం. నాతో పోటీ పెట్టుకుంటే, మీ అన్నకు జరిగిన శాస్తే నీకూ జరుగుతుంది. అందుకు సిద్ధపడితే రేపే పోటీలో పాల్గొను!" అన్నాడు.

రెండోవాడు, రాజుతో పోటీకి దిగాడు. ఆ పోటీలో రాజు మృదంగవాయిద్యం శ్రోతలకు ఏవగింపు కలిగించింది.రెండోవాడు మాత్రం మృదంగవాయిద్యంలో గొప్ప ప్రతిభ కనబరిచాడు. అయితే, రాజుకు భయపడి ప్రజలు మళ్ళీ రాజుపక్షానే నిలిచారు. ఫలితంగా రెండోవాడికి కొరడా దెబ్బల శిక్ష పడింది.

రెండోవాడు కూడా బిక్క మొహం వేసుకుని కొరడా దెబ్బలతో తిరిగి వచ్చేసరికి, మూడోవాడు మండిపడి, "ప్రజల ముందు ఒక విద్వాంసుడి కొడుకులను చవటల్ని చేసి దండించినందుకు, ఈ రాజునే అసలైన చవటను చేసి తగిన శాస్తి చెయ్యకపోతే, నేను సంగీత విద్వాంసుడి కొడుకునే కాదు," అని వీణ, మృదంగం, సన్నాయి తీసుకుని, అప్పటికప్పుడే రాజధానీ నగరానికి బయలుదేరాడు.

రాజధాని చేరుకున్న మూడోవాడు, ఒక కూడలి ప్రదేశంలో కూర్చుని, తనకెదురుగా

మృదంగం, సన్నాయి పెట్టుకుని, అదే పనిగా దివారాత్రాలువీణవాయించసాగాడు. మూడు దినాలు గడిచే సరికి, వీణాతంత్రులు మీటు తున్న మూడోవాడి చేతివేళ్ళనుంచి రక్తం బొట్లు బొట్లుగా కారసాగింది. ఈ విషయం ఈ నోటా ఆనోటా పడి రాజు చెవినపడింది. ఆయన మంత్రులతో కలిసి హుటాహుటిన బయలు దేరి, మూడోవాడిని చూడబోయాడు.

రాజును చూడగానే, మూడోవాడు లేచి నమస్కరించాడు.

"ఎవరు నువ్వు? ఏమిటీ పిచ్చి పని?" అని అడిగాడు రాజు.

అందుకు మూడోవాడు, "ప్రభూ! నాది కొండకోనల్లో వుండే భైరవకోన అనే గ్రామం. మా గ్రామానికి రోజూ ఎక్కడినుంచో, నా ఈడు వాడే అయిన ఒక కుర్రవాడు వచ్చి, నాతో ఆడుకునేవాడు. ఒకరోజు ఆ కుర్రవాడు తాటి ముంజలు తినాలని కోరితే, నేను కత్తి తీసు కుని బయలుదేరాను. గ్రామం చివరికివచ్చాక, ఆ కుర్రవాడు వేసవి కావడం వల్ల తాపంగా వుందని, కనిపించిన పెద్ద నీటివాగులో స్నానా నికి దిగాడు. చూస్తూండగానే వాగులో మునక వేసిన, ఆ కుర్రవాడు ఎంతకీ పైకి రాలేదు. నాకు భయంవేసి కత్తిని నడుముకు కట్టుకుని, వాగులో దూకి అడుగుకు వెళ్ళాను. అక్కడ వింతసర్పం ఆ కుర్రవాణ్ణి మింగుతూ కనిపిం చింది. దాని పొట్ట తెల్లగా వుండి, పైన చర్మం పులి చర్మంలా చారలు చారలుగా వున్నది. ఆ దృశ్యం చూసి నేను క్షణంకూడా ఆలస్యం చేయకుండా, కత్తితో దాన్ని నిలువునా చీరేసి, నా మిత్రుణ్ణి రక్షించాను. వాడు కృతజ్ఞతగా, తనతోబాటు తన ఇంటికి రమ్మని బలవంత



పెట్టి-కొండలూ, అడవులూ దాటించి, ఒక కొండకోనలోకి తీసుకువెళ్ళాడు. ఆ కోనలో వున్న ఒక కొండగుహలో, నడుం వరకూ విర బోసుకున్న తెల్లని చింపిరిజుట్టుతో ఒక మంత్రగత్తె ఏవో లేపనాలు చేస్తూ కనిపిం చింది. దాని కళ్ళు దీపాల్లా మెరుస్తున్నాయి. మొహం కుదుములు కట్టి వికృతంగా వున్నది. నా మిత్రుడు ఆ మంత్రగత్తెను సమీపించాడు. మంత్రగత్తె వాణ్ణి చూడగానే అమాంతం కౌగలించుకుని, ముద్దులాడుతూ, 'నా బంగారు కొండ, పొద్దుననగా వెళ్ళి ఇప్పుడా వచ్చేది? నీకిష్టమని కొండబల్లుల కూర వండి పెట్టాను,' అన్నది. కుర్రవాడు, నన్ను ఆ మంత్రగత్తెకు చూపిస్తూ, 'అమ్మా, వీడు నా మిత్రుడు. ప్రాణాలకు తెగించి నన్ను కాపాడాడు. వీడి పుణ్యాన ఈ రోజు ప్రాణా



పాయంనుంచి బయటపడ్డాను!' అని జరిగిందంతా చెప్పాడు.

''అంతా విన్న మంత్రగత్తె ఆవేశంతో ఊగిపోతూ, ఏదో లేపనం తీసుకుని గోడకు పులిమి వికృతస్వరంతో బిగ్గరగా ఏవో మంత్రాలు చదివింది. మరుక్షణమే లేపనం పూసిన గోడ అద్దంలా మారిపోయి అందులో మంత్రగత్తె కొడుకు మునిగిన వాగు, వాగు అడుగున ముక్కలుగా పడివున్న పాము కళేబరము కనిపించాయి. ఆ దృశ్యం చూడగానే మంత్రగత్తె మళ్ళీ ఏవో మంత్రాలు చదివింది. చూస్తూండగానే ఆ కళేబరం మాయమై, ఆ స్థలంలో చచ్చిపడి వున్న ఒక మంత్రగత్తె శవం కనిపించింది. ఆ శవాన్ని చూస్తూనే మంత్రగత్తె వికవికా నవ్వుతూ, కాసేపు క్షుద్రనాట్యం చేసింది. తర్వాత అది నా భుజం తట్టి, ''భళిరా, కుర్రాడా, నువ్వు చంపింది పామును కాదు; అది నా చిరకాల శత్రువైన ఒక మంత్రగత్తె. దాన్ని ఎన్ని విధాల ప్రయత్నించినా నేను చంపలేక పోయాను. ఇన్నాళ్ళకు నువ్వు దాన్ని హతమార్చి నన్నూ, నా బిడ్డనూ రక్షించావు. నీకు బహుమతిగా ఒక మాయావీణనూ, దానితో పాటు ఒక మృదంగం, సన్నాయి ఇస్తాను. నువ్వా మాయావీణను బాగా వాయించగలిగితే, దాని మహిమవల్ల ఇద్దరు అదృశ్య యువకులు వచ్చి, మృదంగాన్నీ, సన్నాయినీ వాయించి ఆశ్చర్యపరుస్తారు,' అన్నది.

''ఆ మంత్రగత్తె ఇచ్చిన మాయావీణను తీసుకు వచ్చి మూడు రోజుల నుంచి వేళ్ళు తెగేలా మీటినప్పటికీ, ఆ అదృశ్యయువకులు వచ్చి, ఈ మృదంగం, సన్నాయిలను వాయించలేదు. ఆ మంత్రగత్తె నన్ను మోసపుచ్చిందో, ఏమో!'' అని ముగించాడు.

అంతా విని రాజు ఫకాలున నవ్వి, ''పిచ్చివాడా! మంత్రగత్తె నిన్ను మోసగించలేదు. వీణను బాగా వాయించగలిగితేనే, దాని మహిమ తెలుస్తుందని, అది ముందే నీకు చెప్పింది. నీకు వీణ మీటడం చేతగాక దాన్ని నిందిస్తున్నావు. ఇప్పుడువీణ నేను మీటి చూపిస్తాను. ఆ అదృశ్యయువకులు వచ్చి మృదంగం, సన్నాయి ఎలా వాయిస్తారో చూడు!'' అని గుర్రం దిగి, వీణ ముందు కూర్చుని, వీణ వాయించ సాగాడు. రాజు వీణను మీటిమీటి తంత్రులను తెంపేశాడేగాని, ఆ అదృశ్య యువకులు వచ్చి మృదంగం, సన్నాయిలను వాయించలేదు.

చివరకు రాజు విసిగిపోయి, ''సంగీత సమ్రాట్టునయిన నాకే దీని మహత్తు పని

చేయలేదంటే, ఇది సామాన్యమైన వీణకాదు. సంగీతంలో నన్ను మించినవాడైతేనే దీన్ని వాయించగలడు. త్వరలో జరగబోయే దసరా ఉత్సవాల్లో పోటీలు నిర్వహించి, ఎవడైతే ఈ వీణద్వారా అదృశ్యయువకుల్ని రప్పించ గలడో, వాణ్ణి అగ్రహారంతోపాటు ధన కనక వస్తువాహనాలిచ్చి సత్కరించగలను,'' అని చెప్పి, ఆ వాయిద్యాలను తీసుకుని వెళ్ళి పోయాడు. ఆ మరుసటి రోజే రాజు, ఈ విష యాన్ని ప్రజలకు తెలియబరుస్తూ నగరంలో చాటింపు కూడా వేయించాడు.

ఇది జరిగిన కొద్ది దినాలకే నవరాత్రి ఉత్స వాలు వచ్చాయి. ఆ వేడుకల్లో చివరి రోజు రాజు, మాయావీణ పోటీలు నిర్వహించాడు. ఎందరో ఆ పోటీలో పాల్గొని ఎంత ప్రయత్నిం చినా, అదృశ్యయువకులు వచ్చి మృదంగం సన్నాయిలను వాయించనేలేదు. చివరకు విద్వాంసుడి మూడో కొడుకు వచ్చి, రాజుకు నమస్కరించి, ''ప్రభూ, మీరు పోటీలు ప్రకటించిన నాటినుంచి నేటివరకూ, ఒక మహావిద్వాంసుడి దగ్గర వీణావాదంలోశిక్షణ పొందాను. మీరనుమతిస్తే, నేను కూడా ప్రయత్నిస్తాను,'' అన్నాడు.

రాజు వెటకారంగా నవ్వి, ''ప్రయత్నించి చూడు!'' అన్నాడు.

మూడోవాడు వీణ ముందు కూర్చుని ఇష్ట దైవాన్ని ప్రార్థించి, వీణ మీటడం మొదలు పెట్టాడు. కొద్దిసేపు గడిచేసరికి జనం మధ్య నుంచి విద్వాంసుడి పెద్దకొడుకు, రెండో కొడుకు మారు వేషాల్లో రంగు రంగుల విచిత్ర మైన వస్త్రధారణతో నడుచుకుంటూ వచ్చి మృదంగం, సన్నాయిల ముందు కూర్చుని, ఆ వాయిద్యాలను అద్భుతంగా వాయించ సాగారు. చూస్తూన్న ప్రజలు పరవశత్వంతో కరతాళ ధ్వనులు చేశారు. సంగీతంలో ఆరి తేరిన ఆ ముగ్గురన్నదమ్ములు కలిసి, ఆ పోటీని సంగీత కచేరిలా రక్తికట్టించారు. రాజు, ప్రజలు తన్మయత్వం నుంచి తేరుకునే సరికి, అదృశ్యయువకులు వేదికమీద లేరు. వీణ మీటడం ఆపి, మూడోవాడు ఒక్కడే వీణ ముందు కూర్చునివున్నాడు.

రాజు ప్రకటించినట్టుగానే మూడోవాడిని ఘనంగా సత్కరించి, అగ్రహారం, ధన కనక వస్తు వాహనాలతోపాటు, అతడి తండ్రికి వైద్యం చేసేందుకు రాజవైద్యుణ్ణి అతడి వెంట పంపాడు.





# శాంతోపాయం

నరేంద్రుడు యువకుడు, అందగాడు. అందరూ మెచ్చుకునేటంత గొప్పవాడు కావాలని, అతడి కోరిక. అందుకోసం బాగా డబ్బు సంపాదించాడు. అయితే, అలా డబ్బు సంపాదించినవాళ్ళు చాలామంది ఉన్నారు. అందరి మెప్పుపొందే సాహసకార్యం ఏదైనా చేయాలనుకున్నాడు, నరేంద్రుడు. కానీ ఏ సాహస కార్యాన్నెన్నుకుందామన్నా, అంతకంటే గొప్ప సాహసకార్యాలు అప్పటికే ఎందరో చేశారు. కాబట్టిఅదీ లాభం లేదనిపించింది,నరేంద్రుడికి.

నరేంద్రుడి మరదలు శాంత. ఆ పిల్లకు నరేంద్రుడంటే చెప్పలేనంత ఇష్టం. బావ ఆలోచనాధోరణి తెలిశాక, ఒకనాడామె నరేంద్రుడితో, "బావా, గొప్పతనం దానంతటది రావాలికానీ, ప్రయత్నిస్తే రాదు. నన్ను పెళ్ళిచేసుకో! నేను తప్పకుండా నిన్ను గొప్పవాణ్ణి చేస్తా," అన్నది.

"అలాగా!" అంటూ నరేంద్రుడు నవ్వి, "శాంతా, నాకు నువ్వంటే ఇష్టం. ఎలాగూ నిన్నే పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. అయితే, నువ్వు నన్ను గొప్పవాణ్ణి చెయ్యగలనన్నావుగా. అదేదో పెళ్ళికిముందే చేసి చూపించు. మనపెళ్ళి వెంటనే జరిపించమని పెద్దలకు చెబుతాను," అన్నాడు.

"అలాగా! నేను నీకొక గొప్పఉపాయం చెబుతాను. అది చెప్పేముందు, నువ్వు నన్ను తప్ప ఇంకెవర్నీ పెళ్ళిచేసుకోనని మాటివ్వాలి. ఆ తర్వాత మాట తప్పకూడదు, సరేనా?" అన్నది శాంత.

నరేంద్రుడు ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా, "ఇదుగో,ఇప్పుడే మాట ఇస్తున్నాను. కావాలంటే నీ మీద ఒట్టు!" అన్నాడు.

"ఒట్టేం అక్కర్లేదుకానీ—నువ్వు నన్ను ప్రేమిస్తున్నావనీ, ప్రాణంమీదికి వచ్చినా సరే ఇంకో అమ్మాయిని పెళ్ళచేసుకోననీ, మన ఊరంతా ప్రచారమయ్యేలా చూడు, చాలు," అన్నది శాంత.

ఇందుకు నరేంద్రుడు చిరాకుపడి, "నీకు నామీద నమ్మకం లేక ఇలాంటి నిబంధనలు

"వసుంధర"

పెడుతున్నావు. వీటికి నేనొప్పుకోను. ఇష్ట ముంటే ఏదైనా ఉపాయం చెప్పు, లేకుంటే లేదు,'' అన్నాడు.

ఆ జవాబుకు శాంతనొచ్చుకుని, ''అయ్యో, అలా అంటే ఎలాబావా! నా ఉపాయమంతా, నువ్వు ఊళ్ళోచేసే ప్రచారంలోనే వుంది. నా మాట విని, ఒకనెలరోజుల పాటు అలాంటి ప్రచారం కొనసాగించు. పైనెలలో రాజకుమారి మన ఊరిపక్క అడవికి వనవిహారానికి వస్తున్నది. ఆ సమయంలో దగ్గర్లోవుండి సాహస కార్యం ఏదైనాచేసి, ఆమెను మెప్పించు. ఆమె నీకేం కావాలని అడుగుతుంది...'' అంటూ ఆగింది శాంత.

నరేంద్రుడికిదంతా, చాలా కుతూహలంగా ఉంది. మొత్తం అంతా వివరంగా చెప్పమని అతడు శాంతను బలవంతపెట్టాడు.

శాంత చెప్పిన ప్రకారం, రాజకుమారి, నరేంద్రుణ్ణి పెళ్ళిచేసుకోమని అడగాలి. నరేంద్రుడు నిరాకరించాలి. శాంతమీది ప్రేమతో రాజకుమార్తైనే కాదన్నాడని, నరేంద్రుడికి చెప్పలేనంత పేరువస్తుంది. దేశమంతటా నరేంద్రుడిపేరు మోగిపోతుంది!

ఇలా చెప్పి శాంత, ''ఈ ప్రపంచంలో త్యాగాన్ని మించినగొప్పకార్యం వేరేలేదు.అందువల్ల, నా ఉపాయాన్ని పాటించు,''అన్నది.

''అది సరేకానీ, రాజకుమారి నన్ను పెళ్ళిచేసుకోమని అడగడానికీ, తనను నేను కాదన్నానని ప్రచారం చేయడానికీ ఒప్పుకుంటుందా?'' అని అడిగాడు నరేంద్రుడు అనుమానంగా.

''అంతా నాటకమని ముందే చెబుతావు కాబట్టి, అన్నింటికీ ఒప్పుకుంటుంది. నీ



ప్రేమను పరీక్షించడానికే తను ఈ నాటకమాడానని ఆమె అంటే—ఆమెకూ చిన్నతనముండదు. నేను చెప్పినట్టుచెయ్యి. నీ అభీష్టం తప్పక నెరవేరుతుంది,'' అన్నది శాంత.

''ఇంత చిన్న విషయానికి నాకు పేరొస్తుందని నమ్మకం లేదు. కానీ, నీ ఉపాయం మహగొప్పగావుంది. తప్పకుండా పాటిస్తాను,'' అన్నాడు నరేంద్రుడు.

ఆ మర్నాటినుంచే, నరేంద్రుడికి శాంత అంటే ప్రాణమనీ, ఆమెనుతప్ప మరొక ఆడపిల్లను కన్నెత్తికూడా చూడడనీ, ఆ ఊళ్ళో తెలిసిపోయింది. ఒక నెల రోజుల పాటు ఆ ప్రచారం ముమ్మరంగా కొనసాగింది.

ఒక రోజున శాంత, నరేంద్రుణ్ణి కలుసుకుని, ''బావా! రేపే రాజకుమారి మన సమీ



పానవున్న అడవికి తరలివస్తున్నది. వెళ్ళి నీ చాతుర్యం చూపించి మన ఉపాయాన్ని అమలుచెయ్యి. ఎందుకైనా మంచిది, ఒక కత్తిని దగ్గరవుంచుకో,'' అని చెప్పింది.

శాంత చిన్నాన్న రాజుకొలువులో పని చేస్తున్నాడు. ఆయన ద్వారా రాజకుటుంబానికి చెందిన రహస్య సమాచారం, శాంత కుటుంబానికి తెలుస్తూంటుంది. ఈ సంగతి నరేంద్రుడెరుగు. అందువల్ల, మర్నాడే అతడు అడవిలోకి వెళ్ళాడు.

నరేంద్రుడు కొంతదూరం వెళ్ళేసరికి, ''రక్షించండి! రక్షించండి!''అన్న స్త్రీ ఆర్తనాదం వినిపించింది. అతడు పరుగున అటుగా వెళ్ళాడు. ఒక బుర్రమీసాలవాడు కత్తి చూపి, ఒక అందమైన యువతిని బెదిరిస్తున్నాడు. నరేంద్రుడు వెంటనే కత్తిదూసి బుర్రమీసాల వాడి మీదికి వెళ్ళాడు. వాడు కొద్దిసేపు పోరాడి నరేంద్రుడి ధాటికి తట్టుకోలేక పారిపోయాడు.

''మహావీరా! సమయానికి వచ్చి నన్ను రక్షించావు. నేనీదేశపు రాకుమారిని. పేరు శశిరేఖ!'' అంటూ యువతి తనను తాను పరిచయం చేసుకుని, తాను అడవిలోకి రావడం ఎందుకు జరిగిందో చెప్పింది.

శశిరేఖకు ఆమెకంటే పదిహేను సంవత్సరాలు పెద్దవాడైన మేనమామ వున్నాడు. అతడు దుష్టుడు. రాకుమారిని పెళ్ళిచేసుకుని, తనే దేశానికి రాజుకావాలని కలలు కంటున్నాడు.

అనారోగ్యంతో మంచం పట్టివున్న రాజు, వేరే సంబంధాలు చూసే వ్యవధిలేక, నమ్మకస్థుడైన ఒకమంత్రి సాయంతో, ఈ వనవిహారంఏర్పాటుచేశాడు. అదృష్టం బాగుంటే శశిరేఖకు తగినవరుడు తటస్థపడతాడు; లేకుంటే శశిరేఖ, మేనమామనే పెళ్ళిచేసుకోవాలి!

''మహావీరా! ఆ బుర్రమీసాల వేషధారి, మా సైన్యంలో గొప్ప ఖడ్గనిపుణుడు. నన్ను రక్షించేందుకు అంతటివాడి మీద కత్తిదూశావు. అది నీ సాహసాన్ని తెలియజేస్తుంది. అతడు పారిపోవడం, కత్తియుద్ధంలో నీవు అతణ్ణి మించినవాడి వనడానికి నిదర్శనం. నీవు అందగాడివి, సాహసివి, వీరుడివి. నీవు నాకు నచ్చావు. నేనూ నీకు నచ్చితే, రేపు మీ ఇంటికి రథాన్ని పంపుతాను. నన్ను పెళ్ళాడి, ఈ దేశానికి రాజువై నన్నూ, నీ దేశాన్నీ కాపాడుకో,'' అన్నదాయువతి.

నరేంద్రుడు ఆమెకు శాంత ప్రేమగురించి చెప్పలేదు. గొప్పవాడు కావాలనుకున్న తన కోరిక, తనను ఏకంగా ఈ దేశానికి రాజును

చేస్తున్నదని పొంగిపోతూ, "రాకుమారీ! నాకు మీ మాటలు శిలాశాసనం!" అన్నాడు.

తర్వాత నరేంద్రుడు, రాజకుమారి అందాన్ని పదేపదే గుర్తుచేసుకుంటూ తిరిగి తన ఊరు చేరాడు.

మర్నాడు నరేంద్రుడి ఇంటిముందు రథమొకటి వచ్చి ఆగింది. అందులోంచి బుర్రమీసాలవాడు, శశిరేఖ దిగి సరాసరి నరేంద్రుడి ఇంటిలోపలికి వెళ్ళారు. నరేంద్రుడి తండ్రి తమనుచూసి ఆశ్చర్యపోతూంటే, బుర్ర మీసాలవాడు, "మేము మీ కుమారుడితో పెళ్ళి మాటలకు వచ్చాం!" అన్నాడు.

"అయ్యా; తమరెవరో మేము తెలుసుకోవచ్చా?" అన్నాడు నరేంద్రుడి తండ్రి.

"మీ కుమారుణ్ణి ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన శాంతకు నేను చిన్నాన్నను. రాజుగారి కొలువులో పనిచేస్తున్నాను. మీ ఊరికి రావడం నాకిదే మొదటిసారి. ఈ అమ్మాయి పేరు శశిరేఖ. నా కూతురు. శాంత కోరిందని మీవాడి ప్రేమకు చిన్నపరీక్ష పెట్టింది. పరీక్షగురించి మీ వాడికీతెలుసు. కానీ పరీక్షలో చిన్నమార్పు జరిగేసరికి, మీవాడు దెబ్బతిన్నాడు. అయినా, శాంత మీవాడినేచేసుకుంటానంటూంటే, పెళ్ళిమాటలకు వచ్చాం. శాంత తలిదండ్రులు కూడా కాసేపట్లో మీ ఇంటికి వస్తారు," అన్నాడు బుర్ర మీసాలాయన.

తండ్రి పక్కనే నిలబడివున్న నరేంద్రుడు, అంతావిని తలదించుకున్నాడు. ఆరోజేఅతడికీ, శాంతకూ పెళ్ళి నిశ్చయమైంది. నరేంద్రుడు, శాంతను ఒంటరిగా కలుసుకుని, "శాంతా! నీ ఉపాయంతో గొప్పవాణ్ణి కాగలననుకున్నాను, కాలేకపోయాను. నన్నుపెళ్ళిచేసుకుని, నువ్వనుకున్నది సాధిస్తున్నావు. కానీ నిన్ను పెళ్ళి చేసుకుని నేను అనుకున్నది సాధించలేనని తెలిసిపోయింది. నాకెంతో బాధగావుంది!" అన్నాడు.

దానికి శాంత చిన్నగా నవ్వి, "బావా! గొప్పతనం డబ్బు, ప్రేమ, శక్తి, పదవిలాంటి వాటిల్లో వుందని చాలామంది అనుకుంటారు.కానీ గొప్పతనం త్యాగంలోవుంది. త్యాగం ఎంత కష్టమో నీకు తెలియాలనే, నేనీనాటకమాడాను. ఇక ఎన్నడూ గొప్పతనం గురించి అతిగా ఆలోచించకు! హాయిగా మన బ్రతుకు మనం బ్రతుకుదాం," అన్నది.

కాబోయే భార్య వివేకానికి నరేంద్రుడు సంతోషించి, గొప్పవాడు కావాలన్న ఆలోచనను విడిచిపెట్టాడు.





# ఆరుద్రవాన

వేంగీ దేశాన్ని మాణిక్యవర్మ అనే మహారాజు పాలించేకాలంలో, ఆయన కొలువులో కీర్తిసేన అనే రాజనర్తకి వుండేది. కీర్తిసేన మంచి అంద గత్తె. ఆమె అందానికి తగ్గట్టు ఆమె తలనీలాలు చాలా అందంగా వుండేవి. అందమైన కురు లంటే, కీర్తిసేన కురుల్లావుండాలని, రాజ్య మంతా చెప్పుకునేవారు.

ఇలావుండగా–ఆమె శరీరంలో ఎలాంటి మార్పు జరిగిందోకాని, ఆమె అందమైన జుట్టు రాలిపోవడం మొదలైంది. దాంతో ఆమె భయ పడి రాజవైద్యుణ్ణి సంప్రదించింది. రాజ వైద్యుడు, ఆమెకు వైద్యం చేసినా ప్రయో జనం కనబడలేదు.

అప్పుడు రాజవైద్యుడు, "అమ్మా, కీర్తి సేనా! మందులకు నయంకాని రుగ్మతకు, మేము కూడా దేవుణ్ణి ఆశ్రయించక తప్పదు. మన రాజ్యంలోని పలవెల అనే గ్రామంలో, ఒక శివాలయం ఉన్నది. ఆ శివాలయంలోని శివలింగానికి కేశాలతో కూడిన కొప్పువున్నది. అందుచేత, అందరూ ఆ శివలింగాన్ని, కొప్పు లింగేశ్వరుడి పేరుతో పిలుస్తూ పూజిస్తున్నారు. నీ శిరోజాలను రక్షించమని, ఆ కొప్పులింగేశ్వ రుణ్ణి వేడుకో," అని చెప్పాడు.

ఆయన చెప్పిన విధంగా, రాజనర్తకి, "పలవెల గ్రామంలోవెలసిన కొప్పులింగేశ్వర స్వామీ! నీవు గనక నా శిరోజాలు రాలిపోవడం అనే జబ్బును నివారిస్తే, నీ కోవెలకు వచ్చి నిన్ను సేవించి, నీ మంటపంలో నాట్యం చేస్తాను," అని మొక్కుకున్నది.

రాజవైద్యుడి మందుల ప్రభావమో లేక కొప్పులింగేశ్వరుడి మహిమో–రాజనర్తకి శిరోజా లను పట్టినవ్యాధి నయమై, మళ్ళీఅందంగా కళకళలాడాయి.

కీర్తిసేన, రాజుగారి దగ్గరకు వచ్చి, పలివెల గ్రామంలోని కొప్పులింగేశ్వర ఆలయంలో నాట్యప్రదర్శనకు అనుమతి కోరింది.

రాజు ఆమె ద్వారా జరిగినదంతా విని, "ఆహా, అద్భుతం! అంత భక్తసులభుడైన

డా.జొన్నలగడ్డ మార్కండేయులు

కొప్పులింగేశ్వరుణ్ణి దర్శించి తీరవలసిందే!'' అని, మంత్రితో, ''కీర్తిసేన నాట్యప్రదర్శనలతోబాటు, మా ప్రయాణానికికూడా సన్నాహాలు చేయించండి!'' అని చెప్పాడు.

ఈ సంగతి తెలిసి ఒక్కసారిగా పలవెల గ్రామం రూపురేఖలు మారిపోయాయి. దేవాలయాన్ని చక్కగా అలంకరించారు. మండపంలో రాజనర్తకి నృత్య ప్రదర్శనకు చురుగ్గా ఏర్పాట్లు జరిగాయి. ఆ రోజు మాణిక్య వర్మ దేవాలయంలో ప్రత్యేకపూజలు చేశాడు. అందువల్ల, సామాన్య భక్తులకు దేవాలయంలో ప్రవేశించే అవకాశం కలగక కొంత ఇబ్బంది కలిగింది.

ఆ సమయంలో, కొంచెందూరప్రాంతం నుంచి వచ్చిన సుందరమ్మ అనే ఆమె ''మహారాజైతే ఊడిపడ్డాడా? కొప్పులింగేశ్వరుడు ఆయనకెంతో మాకూ అంతే! లింగేశ్వరుడి జటాజూటంలోంచి వదిలిన గంగమ్మ నీళ్ళతో తడిసి, ప్రతి ఏటా నేను మగవాడినవుతున్నాను. మా ముసలెద్దుకు యౌవనం వచ్చింది. మళ్ళీ ఆ రోజులు దగ్గరపడుతున్నాయి. మా ఎద్దుకు యౌవనం రావాలి. నేను మగవాడినవ్వాలి.ఈ రాజ్యానికి మేం తిండి పెట్టాలి. స్వామీ! ఆలయ ప్రవేశానికి కరుణించు,'' అంటూ అరవసాగింది.

మహారాజు, ఆమె అరుపుల సారాంశం విని, సుందరమ్మను దేవాలయంలోకి పిలిపించాడు. ఆమెతోబాటు ఆమె భర్తకూడా లోపలకు వచ్చాడు. వాళ్ళు తమ చేతులలోని సంచీల నుంచి దూదిని రాశికింద పోసి, ''హరహర మహాదేవ శంభో'' అంటూ, దూదిని వెలిగించి, ఆ గర్భగుడిలోనే శివుడికి



సాష్టాంగ నమస్కారం చేశారు. మహారాజు కనుసన్నలతో వారించడం చేత, ఆ దంపతులు చేస్తున్న పనిని ఎవరూ వారించలేదు. ఆ తర్వాత, రాజు మాణిక్యవర్మ పూజతోబాటే, ఆ దంపతుల పూజకూడా, పూజారి స్వామికి జరిపించాడు.

పూజ పూర్తయిన తర్వాత మహారాజు, సుందరమ్మను, ఆమె భర్తను తను కూర్చున్న చోటుకు పిలిపించి వాళ్ళతో, ''దేశమేలే మహారాజును కాబట్టి, శత్రుభయం అనే వంకతో సంప్రదాయంగా వస్తున్న రక్షణ ఏర్పాట్లు, నాకు ఇష్టంలేకపోయినా, తప్పలేదు. దైవ సన్నిధిని చేరడానికి—మగవాడినయ్యాను. ముసలెద్దుకు యౌవనం వచ్చింది —అంటూ ఉన్మాదిలా ప్రవర్తించి, గర్భగుడిలో దూదిని మంటబెట్టడం గురించి మాత్రం, మీరు వివరణ ఇచ్చుకోక తప్పదు,'' అన్నాడు కోపంగా.

అప్పుడు సుందరమ్మ భర్త వెంగళప్ప విన యంగా, ''మహారాజా! నా భార్యది పిచ్చి వాగుడు కాదు. మనకు అశ్వని మొదలు రేవతివరకుగల, ఇరవై ఏడు నక్షత్రాలలోను సూర్యుడి ప్రవేశాన్ని బట్టి వర్షపాతాన్ని లెక్క గట్టడం ఆనవాయితీ. ముఖ్యంగా మృగశిర మొదలుకుని విశాఖవరకు గల నక్షత్రాలకు, పన్నెండు నక్షత్రాల కార్తెలలోనూ కురిసే, కురవకూడని వర్షపాతం బట్టి వ్యవసాయనికి లాభ నష్టాలు అంచనా వేస్తారు. ఈ ఏడు వానలు బాగా పడ్డాయి. మృగశిరలో కురిసిన వానలకు ముసలెద్దులు కూడా చురుగ్గా పొలాలు దున్నాయి. రుద్రుడి జటాజూటం లోంచి పొంగిన గంగలా, ఆరుద్ర కార్తెలో కురి సిన వానలో తడుస్తూ, నా భార్య మగవాడితో సమంగా కష్టించి పొలంలో పనిచేసింది. నా భార్య మాట్లాడిన మాటలు ఆరుద్రవానకు, మృగశిరకు సంబంధించినవి. నా భార్య, తమ దృష్టిలో ఉన్మాదిలా ప్రవర్తించినందుకు క్షమించండి!'' అన్నాడు.

ఆ మాటలతో శాంతించిన మాణిక్యవర్మ, ''అది సరే, మరి శివుడి గర్భగుడిలో దూది మంట వేయడం ఏమిటి ?'' అని అడిగాడు.

''మహారాజా! పుష్యమాసంలో మునిమాపు వేళ నాగలి కాడికి, పలివెడు—అంటే ఇరవై చిన్నెముల ఎత్తుగల దూదిని చుట్టి పొలంలో వుంచుతాం. వేకువున వచ్చి ఆ దూదిని పిండినప్పుడు ధారగా నీటిబిందువులు వస్తే, మృగశిరకార్తె నుంచి మంచివానలు! బిందు వులు, బిందువులుగా పడితే తక్కువ వాన. ఈ ఏడు మంచి వానలు కురవాలని పరీక్షిం చిన దూదినే మేము శివుడి ముందు హారతిగా వెలిగించాం,'' అన్నాడు వెంగళప్ప.

ఆ జవాబుకు రాజు సంతోషించి, ''ఆరుద్ర వానలో ఏమోగాని, ఈ రుద్రుడి గుడిలో సుంద రమ్మ మగవాడిలా రాజునుకూడా తుప్పుపట్టింది. ఆరుద్రవానలో తడిసి, ఆడది మగవాడిలా పనిచేయగలిగే వానలు కురిసి, పంటలతో మన వేంగీరాజ్యంఅన్నపూర్ణకావాలి!'' అన్నాడు.

రాజనర్తకి కీర్తిసేన నాట్యం ముగిశాక రాజు సుందరమ్మను, వెంగళప్పను అందరిముందు సన్మానించాడు. ఆనాటి వేంగీరాజ్యంలో ఆరుద్రవానలు కురిసినప్పుడు, స్త్రీలు ఒక్క రోజైనా పొలంలో పనిచేసేవారు.





# ఆంతరంగికుడు

మహేంద్రగిరిని పురందరుడనే రాజు పాలించేవాడు. ఆయన రాజ్యతంత్రం బాగా తెలిసినవాడేగాక, గొప్ప కళాపోషకుడు కూడా. అందుచేత ఆయన వివిధ కళలలో ప్రతిభగలవారిని అవకాశం దొరికినప్పుడల్లా సత్కరిస్తూ ఉండేవాడు.

ఒకనాడు పురందరుడి సభకు ఒక విదేశీయుడు వచ్చాడు. అతని పేరు శ్రీకంఠుడు. ఇతిహాసాలు రాయటం అతని వృత్తి. అతడు అనేక దేశాలు తిరిగి, ఒక్కొక్క దేశంలోనూ ఒక్కొక్క సంవత్సరం పాటు ఉండి, ఆ దేశ భాష నేర్చుకుని, సంవత్సరం పూర్తి అయ్యేలోపుగా ఆ దేశానికి సంబంధించిన చరిత్ర సమగ్రంగా రాసేవాడు. ఇలా అతను పధ్నాలుగు భాషలలో ప్రావీణ్యం సంపాదించి, పధ్నాలుగుదేశాల చరిత్రలు రచించి, ఇప్పుడు మహేంద్రగిరికి వచ్చాడు.

అలాంటివాడు తన రాజ్యానికి వచ్చినందుకు పురందరుడు ఎంతో సంతోషించి, "మా నగరంలోకూడా ఒక సంవత్సరం వుండి, మా దేశ చరిత్రకూడా రాయండి. మీకు కావలసిన ఏర్పాట్లన్నీ నేను చేస్తాను," అన్నాడు.

"అలాగే చేస్తాను. నన్ను ఎడాదిపాటు మీ ఆంతరంగికుడుగా ఉంచుకుని, మీ వెంట ఉండనివ్వండి. అందువల్ల నా పని తేలిక అవుతుంది," అన్నాడు శ్రీకంఠుడు.

అందుకు పురందరుడు సమ్మతించాడు. శ్రీకంఠుడు అధికారరీత్యా రాజుగారి ఆంతరంగికుడి హోదా సంపాదించి, రాజు వెంట విహారాలకూ, వేటకూ, యుద్ధాలకూ సైతం వెళుతూ, రాజుగారి పరిపాలనా విధానాలన్నీ నిశితంగా పరిశీలిస్తూ, అప్పుడప్పుడూ నగరంలో పర్యటనలు చేస్తూ, అన్నిరకాల వాళ్ళతోనూ అనేక విషయాలు మాట్లాడుతూ కాలం గడపసాగాడు. అతను రాజుగారి ఆంతరంగికుడని నగరంలో అందరికీ త్వరలోనే తెలిసిపోయింది. అందుచేత అందరూ అతనికి ఎంతో గౌరవం చూపేవారు. నగరం



లోని ధనికులూ, వర్తకులూ అతన్ని పిలిచి, విందులు చేసేవారు. అతనిద్వారా లాభం పొందవచ్చునని వారి ఆశ.

శ్రీకంఠుడు మహేంద్రగిరికి వచ్చి సంవత్సరంకావచ్చింది. అతను రాయటం మొదలు పెట్టిన మహేంద్రగిరి చరిత్రకూడా పూర్తికా వచ్చింది. ఒకరోజు రాజుగారు ఆ అసంపూర్ణ గ్రంథాన్ని తెప్పించుకుని చదివాడు. అందులో ఆ దేశపు ఆచారవ్యవహారాలూ, ప్రజాక్షేమం కోసం రాజుగారు తీసుకునే ప్రత్యేక చర్యలూ, రాజుగారికీ, సభా ప్రముఖులకూ మధ్య ఉండే విశ్వాసమూ, సహకారమూ మొదలైన వన్నీ చక్కగా వర్ణించి ఉన్నాయి.

''ఈ నగర ప్రజలు అమాయకులు, రాజు ధర్మాత్ముడు. రాజోద్యోగులు అపార మైన రాజభక్తి గలవారు. అయితే ఈ నగరపు వర్తకులూ, ధనికులూ, అక్రమంగా ధనార్జన చేసి, మోసంతో జీవిస్తున్నారు,'' అని శ్రీకంఠుడు ఆ గ్రంథంలో రాశాడు.

చివరిమాట రాజుకు నచ్చలేదు. ఆయన శ్రీకంఠుణ్ణి పిలిపించి, ''నీ గ్రంథం అంతా బాగా ఉన్నది. అందులో వంకపెట్టటానికి ఏమీలేదు. కాని నా నగరంలోని వర్తకులూ, ధనికులూ స్వార్థపరులనీ, మోసగాళ్ళనీ రాశావు. ఇది ఎంతమాత్రమూ నిజంకాదు. వాళ్ళను గురించి నాకు బాగా తెలుసు,'' అన్నాడు.

''నేను రాసిన దానిలో ఏమన్నా తప్పు లుంటే క్షమించాలి. ఈ గ్రంథాన్ని పూర్తిచేసే లోపల తప్పులన్నీ సవరణచేసి మరీ వెళ్ళి పోతాను,'' అన్నాడు శ్రీకంఠుడు.

ఈ మాటతో రాజు తృప్తిపడ్డాడు.

మర్నాడు శ్రీకంఠుడు నగరంలో గల గొప్ప ధనికులనూ, వర్తకులనూ చూడబోయి, ''రాజుగారు చక్రవర్తిగారికి కానుక పంపాలట. మీ వద్ద ఉన్న మేలురకం వజ్రాలు జాబితా రాసుకుని ఇయ్యండి,'' అని అడిగాడు. అలాగే అతను కొందరి దగ్గిర బంగారం కూడా పుచ్చుకున్నాడు. రాజుగారికి చాలా సన్నిహితుడు గనక అందరూ అతనికి లక్షలు విలువచేసే వస్తువులను సంకోచించకుండా ఇచ్చేసి, అతను తయారుచేసిన జాబితాల మీద సంతకాలు చేశారు.

మర్నాడు తెల్లవారేసరికి, క్రితం రాత్రి శ్రీకంఠుడు నగరంనుంచి పరారీ అయినట్టు పుకారు పుట్టి నగరమంతా పాకింది. కిందటి రోజు అతనికి వజ్రాలూ, బంగారమూ ఇచ్చినవాళ్ళందరూ జాబితాలతో సహా రాజు

వద్దకు వెళ్ళి, ''రక్షించండి, మహాప్రభో! మీ అంతరంగికుడు మీ పేరు చెప్పి, మమ్మల్ని దోచేశాడు. ధర్మప్రభువులు, తమరు మాకు కలిగిన నష్టానికిపరిహారం ఇవ్వటం న్యాయం,'' అని మొరపెట్టుకున్నారు.

శ్రీకంఠుణ్ణి వజ్రాలూ, బంగారమూ వసూలు చెయ్యమని తాను నియోగించ లేదు గనక, అతను ధనికులను లూటీచేసి పారిపోయి ఉంటాడని నమ్మి రాజు కోశాధి కారిని పిలిచి, ఎవరెవరికి ఎంత పరిహారం ఇవ్వాలో లెక్కలు కట్టమన్నాడు.

కోశాధికారి అందరి జాబితాలూ తీసుకుని లెక్క కట్టితే, వారికి పరిహారం ఇవ్వవలిసిన మొత్తం ఖజానాలోనే లేదు. ఈమాట విని రాజు కుంగిపోయాడు.

ఇంతలో శ్రీకంఠుడు అక్కడికి ఒక పెద్ద సంచీతో వచ్చాడు. అతను ఆ సంచీని రాజుగారి ముందుంచి, ఆయనకు ఒక జాబితాకూడా ఇచ్చి, ''ఎవరెవరి దగ్గిర నేను ఏమేమి తీసు కున్నదీ వివరంగా జాబితా రాశాను. దాని ప్రకారం ఎవరిసొత్తు వారికి తిరిగి ఇప్పించండి,'' అన్నాడు.

శ్రీకంఠుణ్ణి చూడగానే ఫిర్యాదీలకు ముచ్చె మటలు పోశాయి. రాజు ఇంకా ఏమీ అనక ముందే వాళ్ళు రాజు ముందు సాష్టాంగపడి, ''మహారాజా, మేముసమర్పించిన జాబితాలు సక్రమంగా లేకపోతే క్షమించండి. అంతరం గికుడుగారు పరారీ అయ్యారని విని, లోభ బుద్ధితో జాబితాలు పెంచాము,'' అన్నారు.

రాజు వారి సొత్తు వారికి ఇయ్యటానికి నిరాకరించి, వాళ్ళను పంపేసి, శ్రీకంఠుడు తెచ్చిన సంచిని కోశాధికారి పరంచేసి, ఖజా నాలో చేర్చమన్నాడు.

తరవాత ఆయన శ్రీకంఠుడితో, ''నీ గ్రంథంలో అబద్ధం అంటూ ఏమీ లేదని నిరూపించటానికి చాలా శ్రమపడ్డావు,'' అన్నాడు.

''గొప్పవాళ్ళను గురించి నిజం రాయ టానికి ఇలాటి పాట్లు చాలా పడాలి. మహా రాజా, ఇది కూడా ఒక కళ,'' అన్నాడు శ్రీకంఠుడు.

తరవాత అతను పురందరుడివద్ద గొప్ప సన్మానమూ, అంతులేని బహుమానాలూ పొంది మరొక దేశానికి వెళ్ళిపోయాడు.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ






ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు మార్చ్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

నవంబర్ 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
సి. నిహాలా దత్
డా/ఆఫ్ సి.యు.వి.టి.ఎన్. దత్, ప్లాట్ నం.147, ఫ్లాట్
నం.402 సిద్ధార్థనగర్, వెంగళరావునగర్ సమీపం
హైదరాబాద్-500 038 (ఆం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో : బొమ్మకు అమ్మ!
రెండవ ఫోటో : అమ్మకు బొమ్మ!!

చందమామ సంవత్సర చందా:
ఇండియాలో రూ.120లు
Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited. No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

CHANDAMAMA (Telugu) JANUARY 2002
Regd. with RNI. No. 1114/57
Registered No. TN/Chief PMG-868/2001